# కొత్తపల్లి పిల్లల కథల పుస్తకం-67 ఏప్రియల్ 2014

**మూలం: http://kottapalli.in/2014/04/welcome**


**ఏపని- ఎవరిది:**

ప్రచురణ: కొత్తపల్లి ప్రచురణలు, చెన్నేకొత్తపల్లి

నిర్వహణ: సత్యఫౌండేషన్, చెన్నూరు.

ప్రధాన సంపాదకులు: నారాయణ

సహసంపాదకత్వం: మంజునాథ్

చిత్రాలు: వీరాంజనేయులు, అడవిరాముడు

సాంకేతిక సహకారం: ఆనంద్, లక్ష్మి

వాణిజ్యం: మల్లికార్జున

గౌరవ సలహాదారు: సుబ్బరాజు

అక్షర కూర్పు: కొత్తపల్లి

అలంకరణ: యాక్తూ ఫైన్ఆర్ట్స్ స్టుడియో,
హైదరాబాదు. ఫోను: 04042206233

ముద్రణ: ముద్రికా ఆఫ్‌సెట్‌ప్రింటర్స్, విజయవాడ
ఫోను: 08662579129


స్వాగతం!

కొత్తపల్లిలో పిల్లల రచనలకు ప్రాధాన్యత ఉంటుంది. ఈ పుస్తకంలో దాదాపు సగం కథలు పిల్లలు రాసినవి; మిగిలినవి పిల్లలకోసం పెద్దలు రాసినవి. బొమ్మలు వేసిన వాళ్ళు మటుకు యువకులు.

పిల్లలను కలవటం, వాళ్లతో తెలుగులో కథలు రాయించటం, బొమ్మలు వేయించటం, వాళ్ళు పంపిన కథల్ని, బొమ్మల్ని సరిదిద్ది మిగతా పిల్లలందరికీ నచ్చేట్లు పుస్తకాలుగా తయారు చేయటం, దానికోసం ఓపెన్ సోర్సు ఉపకరణాలను వాడటం, కథల్ని అందరూ ఉచితంగా చదువుకునేట్లు ఇంటర్నెట్‌లో పెట్టటంతోపాటు, కొన్ని ప్రతులు అచ్చువేయటం మాకు ఇష్టం. అందరి మేలూ కోరి చేసే ఈ పనిలో మీరూ పాలుపంచుకోండి. పిల్లల కథల ప్రపంచానికి స్వాగతం!



**వెలల పట్టిక:**

| | **వ్యక్తులు** | **సంస్థలు** |
|---|---|---|
| **విడి ప్రతి వెల** (పోస్టేజీ అదనం) | **25** రూ. | 30 రూ. |
| **12 ప్రతులు** (పోస్టేజితో సహా) | **300** రూ. | 350 రూ. |

రానున్న 12 ప్రతులకోసం డబ్బుల్ని మనిఆర్డరు/బ్యాంకు ట్రాన్సుఫరు ద్వారా చెల్లించండి. మీ చిరునామాను వేరుగా ఫోను/మెయిలుద్వారా తప్పక తెలియజేయండి. పుస్తకాలను సాధారణ పోస్టులో పంపుతాం,
మీ రచనలను పోస్టు/ఇమెయిలు రూపంలో పంపండి. బాగున్నవాటిని తప్పక ప్రచురిస్తాం!

బ్యాంకు ట్రాన్సుఫరు కోసం అక్కౌంటు వివరాలు:
Kottapalli Prachuranalu,
S.B. A/c No: 62320333310
SBH- Dharmavaram Branch,
ISFC code: SBHY0020902


కొత్తపల్లి ప్రచురణలు
1-127/A, యం ఆర్ వో ఆఫీసు దగ్గర,
చెన్నేకొత్తపల్లి- 515101
అనంతపురం జిల్లా
ఫోను: 7702877670 ఇ-మెయిలు: team@kottapalli.in
వెబ్‌సైటు: http://kottapalli.in




# విషయ సూచిక



# ప్రయోగాలు !

సుల్తాన్ ముహమ్మద్ బిన్ తుగ్లక్‌కు నిద్రపట్టట్లేదు-

తను ఈమధ్యే కొత్తగా దక్షిణ భారతదేశం వెళ్ళొచ్చాడు. అక్కడ వరంగల్లులో కాకతీయుల్ని ఓడించి, వాళ్లదగ్గరున్న సంపదనంతా తీసుకొచ్చాడు ఢిల్లీకి. ఆ మధ్య దారిలో, ఔరంగాబాదు దగ్గర చూశాడో ఊరు- "..ఎంత బాగుందో చెప్పలేం! చక్కని కొండ! కోటకు బలే అనువైన కొండ, చుట్టూ అంతులేని మైదానం! బలే ముచ్చటగా ఉండిందది. 'దేవగిరి' అంటారట, దాన్ని. తనైతే దాన్ని 'దౌలతాబాద్' అంటాడు.."

వెనక్కి వచ్చాక తన వజీర్లని అడిగాడు. వాళ్ళు కూడా అవునన్నారు- "ఎప్పుడైనా దేశ రాజధాని అన్నది అందరికీ అందుబాటులో ఉండాలి. దేశం మధ్యలో ఉంటే అందరికీ అనువు. ఇట్లా ఢిల్లీలాగా ఓ మూలకి విసిరేసినట్లు ఉండకూడదు- రాజధాని.."

మహమ్మద్ బిన్ తుగ్లక్ చురుకైనవాడు; పట్టుదల గలవాడు; యువకుడు; అనేక శాస్త్రాలు చదివాడు కూడాను. అందుకని తను సుల్తాను అవ్వగానే దౌలతాబాదు మీద మనసు పెట్టాడు. అక్కడో కోట, కోట చుట్టూ కందకం, రాజ మందిరాలు, కార్యాలయాలు,.. ఇంకా ఏవేవో నిర్మాణాలు చేశాడు; లక్షల దీనారాలు ఖర్చుపెట్టాడు. అదంతా చేశాక, ప్రకటించేశాడు: ఇకమీద భారతదేశపు రాజధాని ఢిల్లీకాదు- దౌలతాబాదు: ఢిల్లీలో ఉన్నవాళ్లంతా పదండి! చలో

దౌలతాబాద్!" అన్నాడు.

అయితే జనాలెవ్వరూ ఢిల్లీనుండి కదల్లేదు. ఉద్యోగులూ కదల్లేదు!

"1400 కిలోమీటర్లు- చాలా దూరం!" అన్నారు కొందరు.

"మేం రాం! ఇక్కడే ఉంటాం! మీరు పొండి, కావాలంటే!" అన్నారు కొందరు.



"ముసలివాళ్ళం బాబు.." అన్నారు కొందరు.

"పశువులున్నై, బాబ్బాబు.." అన్నారు కొందరు.

"సన్న పిల్లలం, మమ్మల్ని వదిలెయ్యండి!" అన్నారు ఇంకొందరు.

"అక్కడ నీళ్ళు లేవటనే?!" అనుమానపడ్డారు కొందరు ప్రగతి నిరోధకులు-

ఇట్లా ఎవరికి తోచినట్లు వాళ్ళు అడ్డం దిడ్డంగా జవాబులిస్తున్నారు తప్పిస్తే, ఎవ్వరూ కదలట్లేదు.

దాంతో తుగ్లక్ గారికి చాలా కోపం వచ్చేసింది-

"కదుల్తారా, లేదా?! లేక మమ్మల్నే కదిలించమంటారా?" అని హుంకరించారు. 'నవాబు తల్చుకుంటే నాట్యానికేం కొదవ?'- సైనికులు ముందుకు దూకి జనాలని తైతక్కలాడించేశారు. జనాల్ని ఇళ్ళలోంచి లాగి పడేశారు. సామాన్లు గిరాటు వేశారు. బళ్ళు కట్టించి సామానెత్తారు. అంతటా హాహా కారాలు. వీళ్ళనుండి తప్పించుకొని వేరే ఏవో ఊళ్ళకు పారిపోయారు కొందరు. 'తప్పదులే' అని కట్టుబట్టల్తో దౌలతాబాదుకు పయనమయ్యారు కొందరు. మధ్యలో రోగాలు, కరువులు, వానలు-ఎండలు, లూటీలు... ఇలా గడిచిన్నై, రెండేళ్ళు.

తీరా దౌలతాబాదుకు చేరినవాళ్ళు చూస్తే అక్కడ ఏమున్నాయ్? -ఏమీ లేవు! ఇంతమంది జనాలు ఉండేందుకు చోటూ లేదు; అందరూ తినేందుకు తిండీలేదు; కనీసం అందరికీ సరిపడా నీళ్ళూ లేవు! మరింత గందరగోళం చెలరేగింది. ఈ మధ్య కాలంలో అటు ఢిల్లీ 'భూతాల నగరం' అయిపోయింది- ఇక్కడ దౌలతాబాదులో బ్రతికేట్లు లేదు పరిస్థితి! జనాల పరిస్థితి 'రెంటికీ చెడ్డ రేవడి' అయిపోయింది.

ప్రయోగాలు చేసేవాడికి వాస్తవిక దృష్టి ఉండాలి. తుగ్లక్ గారి దృష్టి అలాంటిదే- రెండేళ్ళు గడిచేసరికి ఆయనకు అర్థం అయ్యింది: దేవగిరి దేశరాజధానిగా పనికిరాదు. 'ఇక్కడ బాలేదు - రాజధానిని మళ్ళీ ఢిల్లీకి మార్చేశాం" అనేశారు. "అందరూ ఢిల్లీ బయలుదేరండి! చలో ఢిల్లీ! పీఛే ముడ్!" అన్నారు!

"అయ్యో!" "అమ్మో!" "మేం రాలేం" "ఇక్కడే ఉంటాం" "బానే ఉందిలే ఇక్కడ!" "అక్కడ ఉందంతా నాశనం అయిపోయింది; ఇప్పుడు మళ్ళీ వెళ్ళి ఎలా బ్రతుక్కోవాలి?"- ఇలా అన్నీ మళ్ళీ మొదలయ్యాయి.



అయినా తుగ్లక్ చాలా గట్టి ప్రభువు. ఆయన ఏదైనా ఒకసారి నిర్ణయించాడంటే, ఇక దాన్ని వెనక్కి తీసుకోనే తీసుకోడు. రాజధాని తిరిగి ఢిల్లీకి మారింది.

"ప్రయోగాలు చేస్తూ పరిపాలించాలి " అని నమ్మి, నిబద్ధతతో ప్రయోగాలు చేసిన ప్రభువుల్లో మొదటివాడు, ముహమ్మద్ బిన్ తుగ్లక్. ఈయన దేశ రాజధానినే కాదు, దేశపు నాణాలనూ మార్చాడు. కొత్తగా రాగి-ఇత్తడి

నాణాలను అమలులోకి తెచ్చింది ఈయనే! జనాలెవ్వరూ వాటిని వాడకపోయేసరికి, ఈయన బంగారు-వెండి నాణాలను జప్తు చేయటం మొదలు పెట్టాడు. దాంతో తప్పనిసరై, జనాలు బంగారం-వెండివి దాచేసుకుని, సొంత తెలివితో రాగి నాణాల్ని ఎవరికి వాళ్ళు ముద్రించుకొని చలామణి చేసుకోవటం మొదలు పెట్టారు! దాంతో తుగ్లక్ ప్రభువు నాలుక కరచుకొని, "రాగి-ఇత్తడి నాణాల్ని వెనక్కి ఇచ్చేయండి; వాటికి సరిపడ బంగారు-వెండి నాణాలు తీసుకోండి" అని ఓ కొత్త పథకం పెట్టారు. 'ఇదే సందు' అని జనాలు తాము ముద్రించిన రాగి నాణాలుకూడా ఇచ్చేసి, కావలసినన్ని బంగారు నాణాలు తీసుకున్నారు! వెరసి, తుగ్లక్ ప్రభువులవారి ఖజానా మొత్తం ఖాళీ అయ్యింది! అయితేనేమి, ప్రయోగాలు చేస్తుంటేనే కద, సంచలనం! ఆయనకి పేరు వచ్చిందీ వాటి వల్లనే, మరి!

మనం కూడా అనేక ప్రయోగాలు చేస్తుంటాం- కొత్త నిర్ణయాలు తీసుకుంటాం; అవి సరిగ్గా లేవనుకున్నప్పుడు వాటిని వెనక్కి తీసుకుంటాం. అయితే పాలకుల నిర్ణయాలు ఊరికే కాదు- ఎంతోమంది సాధారణ ప్రజల జీవితాలని ప్రభావితం చేస్తాయవి. అందువల్ల పాలకుడన్నవాడు బాగా ఆలోచించాలి - విజ్ఞతతో నిర్ణయాలు తీసుకోవాలి. ఈ నిర్ణయాలలో స్వార్థమూ, తొందరపాటుతనమూ కాక; వివేకమూ, 'అందరూ సుఖంగా ఉండాలి' అన్న భావనా ఉంటే అందరికీ మేలు జరుగుతుంది. ఏమంటారు?

ఒకప్పుడు మన దేశంలో గ్రంధాలయాల వ్యవస్థ చాలా బాగుండేది. ప్రతి బడిలోనూ ఒక గ్రంధాలయం ఉండేది, దానిలో పుస్తకాలు ఉండేవి! ఆ పుస్తకాలను చదువుకునేందుకు ప్రత్యేకించి వారానికి రెండు తరగతులు కూడా ఉండేవి. పుస్తకాలను పిల్లలు ఇంటికి కూడా తీసుకెళ్ళి, చదివి, వెనక్కి తెచ్చి ఇచ్చే వీలుండేది! మనందరం తలచుకుంటే అలా చేయటం ఇప్పుడూ ఏమంత కష్టం కాదు.... తలచుకుందామా, మరి?!




# నీతిచంద్రిక

సంధి - 1

*జరిగిన కథ: కాకి చేసిన మోసం కారణంగా హంస ఓడిపోయింది. నెమలి విజయగర్వంతో తన రాజ్యం చేరుకున్నది. ఇక చదవండి... నీతిచంద్రిక 48 వ భాగం...*

*మూలం- కీ.శే.కందుకూరి వీరేశలింగం* *సరళీకరణ- ఘడియారం వేంకట నారాయణ శర్మ*

తరువాత రాజకుమారులు విష్ణుశర్మతో "అయ్యా! మీ దయవల్ల పంచతంత్రంలో నాలుగు భాగాలు వినగలిగాం. చివరిదైన 'సంధి'ని కూడా వినాలని కుతూహలంగా ఉన్నది. దయచేసి దాన్నికూడా వివరించండి" అన్నారు. అప్పుడు నీతి శాస్త్రాలలోని రహస్యాలన్నీ తెలిసిన విష్ణుశర్మ ఇలా చెప్పాడు-

"నెమలికి, హంసకూ జరిగిన యుద్ధం గురించి 'విగ్రహం'లో విన్నారుగా? ఆ విధంగా ఘోర యుద్ధం జరిగి, అనేకమంది సైనికులు ఇరు పక్షాలలోనూ మరణించిన తరువాత, క్షణ కాలంలో నెమలికి - హంసకు సంధి చేయించాయి గ్రద్ద - చక్రవాకాలు. అదెలా జరిగిందో చెప్తాను వినండి" అంటూ ఇట్లా

చెప్పసాగాడు:

"అట్లా యుద్ధంలో తన పరివారాన్నంతా కోల్పోయి, దు:ఖ పూరితమైన మనసుతో, చావు తప్పి- కన్ను లొట్టబోయిన హంసరాజు, తన మంత్రి దీర్ఘదర్శిని సమీపించి, జరిగిన వినాశనాన్ని నెమరువేసుకున్నది: "సర్వజ్ఞా! మన కోటకు అంత ఘోరంగా అగ్గిపెట్టిన దుర్మార్గుడెవరు? మన కోటలోనే నివాసం ఉంటూ, మారువేషంతో మనల్ని మోసగించి, చిచ్చు అంటించిపోయిన శత్రుపక్షపు గూఢచారులు ఎవరైనా ఉండి ఉంటారా?" అన్నది.

వినయంతోటీ, దు:ఖంతోటీ తలవంచుకున్న చక్రవాక మంత్రి అప్పుడు తలెత్తి, "ప్రభూ! కారణం అంటూ ఏదీ లేకనే తమరి ఇష్టాన్ని చూరగొన్న నీలవర్ణుడు, అతని అనుచరులు మరెందుకో ఇప్పుడు అస్సలు కనిపించటం లేదు ! చూడగా, 'ఇదంతా ఆ విశ్వాస ఘాతకుడు చేసిన పనే' అని నాకు అనిపిస్తున్నది. ప్రభువులవారి అమాయ-కత్వమే ప్రభువులను ఇంతవరకూ తీసుకొచ్చింది. పుట్టు పూర్వోత్తరాలు తెలీకుండానే, కనుగొనకుండానే ఆగంత-కులకు మన హృదయంలో స్థానమిచ్చి నమ్మటం తప్పు. విశ్వాసపాత్రులుకాని అటువంటి దుర్మార్గులు చేసిన పనుల ఫలితం ఈ రోజున అనుభవించాల్సి వస్తున్నది" అన్నది.

అదివిన్న హంసరాజు కూడా క్షణ కాలం పాటు తనలో తాను ఆలోచించి "ఇది అంతా మా దురదృష్టం. మా అదృష్టం ఇట్లా ఉన్నప్పుడు వేరే ఎవరినో అనాల్సిన పని ఏమున్నది? దైవం ప్రతికూలించటం తప్ప ఈ విషయంలో మంత్రుల తప్పు వెంట్రుకవాసంత కూడా లేదు. పనిని చక్కగా నిర్వహించేందుకు మనుషులు ఎంత ప్రయత్నించినప్పటికీ, దైవం అనుకూలించనప్పుడు అది చెడిపోతుంది. నుదిటి రాతను తుడిచి వేయటం ఎవరికి సాధ్యం?" అని విచారంతో ఊరకుండిపోయింది.

అప్పుడు మంత్రి వినయంగా "లోకంలో తెలివితేటలు అంతగా లేనివారు తమకు

కష్టాలు ఎదురైనప్పుడు దైవాన్ని నిందిస్తారు - కానీ తాము చేసిన పనులలోని తప్పులను గుర్తించరు. సరిపోని పదార్థాలను ఇష్టంగా తినే రోగుల మాదిరి, రాజులుకూడా తమ మేలు కోరి చెప్పే మంత్రుల సలహాలను త్రోసి-పుచ్చి, ఆత్మ వంచకులై, క్రొత్త మిత్రుల మోజులో పడి, అటుపైన పనులు చెడినప్పుడు, గర్వం అంతా నశించాక, అప్పుడు 'అదృష్టం' అని మాట్లాడతారు. మంచి మనసు తోటి, మేలుకోరే మంత్రులు ఇచ్చే సూచనలను-సలహాలను స్వీకరించని-వారు, మిత్రుల సలహా వినక చెడిన 'దీర్ఘసూత్రుడు' అనే చేప మాదిరి నశిస్తారు. మీకు ఆ కథ చెబుతాను వినండి" అంటూ మూడు చేపల కథను చెప్పసాగింది:

**మూడు చేపల కథ**

ఒక చెరువులో చాలా కాలంనుండి దీర్ఘదర్శి, ప్రాప్తకాలజ్ఞుడు, దీర్ఘసూత్రుడు అనే చేపలు మూడు కలసి నివసిస్తూ ఉండేవి. ఆ కొలనులో చక్కని నీరు, సమృద్ధిగా ఆహారం ఉండటంతో, అవి అనేక సంవత్సరాలు అక్కడ సుఖంగా బ్రతికాయి.



అయితే ఒకానొక సమయంలో- 'వేసవి సమీపిస్తోంది' అనగా దీర్ఘదర్శి మిగిలిన రెండు చేపల దగ్గరకూ పోయి "మిత్రులారా! మీరు కూడా చూస్తున్నారుకదా! రోజు రోజుకూ వేసవి ఇంకా దగ్గరపడుతున్నది. ఇంకొన్నాళ్లకు నిజంగా నీళ్లు ఇమిరి-పోయేట్లున్నాయి. ఇక ఆ తర్వాత మనం వేరొక చోటుకి పోవాలంటే ఇక సాధ్యం కాదు. కాబట్టి ఇప్పుడే, ఈ చిన్న చెరువును వదిలి, లోతైన నీళ్లతో, అనేక జలచరాలకు ఆధారమై ఉండే మరో పెద్ద చెరువు దేనినైనా చేరదాం, పదండి" అన్నది.

అప్పుడు ప్రాప్తకాలజ్ఞుడు దానితో విభేదిస్తూ "భవిష్యత్తులో రాబోయే ప్రమాదానికి సంకేతాలు ఏవీ గట్టిగా కనబడటం లేదు. తెలివిగలవాళ్ళు ఎప్పటికి ఏది ప్రాప్తిస్తుందో, అప్పటికి-దానికి తగినట్లు- పనులు నెరవేర్చుకుంటూ పోయేందుకు ప్రయత్ని-స్తారు; తప్ప, 'ముందెప్పుడో ఆపదలు వస్తాయేమో' అని ఇప్పుడే మనస్సులో అనవసరపు విచారాన్ని పెట్టుకుని కుమిలిపోరు. చూడు, మనం ఉన్న ఈ మడుగంతా మహాసముద్రం మాదిరి ఇంతలా కళకళలాడుతుంటే, ఇప్పుడే ఇంత దు:ఖం ఎందుకు? అంతగా కష్టాలు తలెత్తితే, అప్పటి సంగతి అప్పుడు చూసుకుందాంలే!" అన్నది.

ఆ రెండింటి మాటలూ విన్న దీర్ఘసూత్రుడికి ఏమి చేయాలో పాలుపోలేదు; ఏం చేయాలో తెలీక, ఊరకనే ఉండాలని నిశ్చయించు-కున్నది అది!

అయితే బాగా ఆలోచించిన దీర్ఘదర్శి - 'ఇంక ఇందులో ఉండటం మంచిదికాదు' అని నిర్ణయించుకుని, ముందుగానే జాగ్రత్తపడి, జల సమృద్ధి గల మరొక చెరువులోకి చేరుకున్నది.



ఆ తర్వాత కొన్నాళ్లు గడిచేసరికి, ఎండలు బాగా పెరిగాయి. పూట పూటకూ చెరువులో నీళ్లు మరింత తక్కువ అవ్వసాగాయి. అది గమనించిన జాలర్లు - వలలు, గాలాలు, ముళ్ల కర్రలు, ఊతాలు, బుట్టలు లాంటి సరంజామాతో వచ్చి దిగబడి, నీళ్లలోకి దిగి, నీటిలోగల చేపలన్నింటినీ పట్టుకుని ఒక్కొక్కదాన్నీ తాళ్ళకు గుచ్చడం మొదలుపెట్టారు.

అది గమనించిన ప్రాప్తకాలజ్ఞుడు అప్పటికప్పుడు ఒక ఉపాయాన్ని

ఆలోచించింది - నీళ్లలోకి వేలాడుతున్న ఒక త్రాడును నోటితో కరచుకొని, గ్రుచ్చినచేప మాదిరి, గ్రుక్కుమిక్కు అనకుండా ఉండింది.



ఇక దీర్ఘసూత్రుడు మటుకు ఆ కష్టంనుండి తప్పించుకునే ఉపాయం కానరాక "ఏం చేయాలి! ఏం చేయాలి! ఎటు పోవాలి?" అని బెదురుతూ అటూ - ఇటూ దూకుతూ గంద-రగోళపడటం చూసి జాలరులు ఆ చేపను కర్రలతో అణచి చంపేశారు.

తర్వాత ఆ జాలర్లు చేపల వేటను చాలించి, తాము పట్టుకొనిన చేపల ఒంటికి అంటిన మట్టిని కడగటం కోసం చేపల గుత్తులను నీళ్లలో జాడించేటప్పుడు, ఆ చేపల మాటున రెండు దవడలతోనూ తాడును అదిమి పెట్టుకుని చచ్చినట్లు కదలక మెదలక ఉన్న ప్రాప్తకాలజ్ఞుడు మెల్లగా దవడలు వదిలి, త్రాడును విడిచిపెట్టి, లోతట్టు నీళ్ళలో ప్రవేశించి, ప్రాణాలు కాపాడుకొన్నది.

కాబట్టి, స్నేహితులు మేలు కోరి చెప్పే మాటలు విననివాడు దీర్ఘసూత్రుని మాదిరిగా అంతం చెందాల్సి వస్తుంది. ఈ కథలో మరొక విశేషంకూడా ఉంది: 'ఇంకా వాటిల్లని కష్టాలను ముందుగానే గ్రహించి, జాగ్రత్తపడేవాడు దీర్ఘదర్శి మాదిరి ఆపదలకు దూరంగా ఉంటూ- సుఖాన్ని అనుభవిస్తాడు.

అలాకాక, ఎప్పటికప్పుడు తోచిన తీరులో మార్గాన్ని వెతుక్కుంటూ, ధైర్యంగా పనులు నెరవేర్చుకోచూసేవాడు ప్రాప్తకాలజ్ఞుని మాదిరి, అనేక అనుమానాలతోటి, భయాలతోటీ కూడుకొన్న జీవితాన్ని అనుభవిస్తాడు.

ఇక అటు భవిష్యత్తును గురించీ ఆలోచించలేక, ఇటు సమయానికి తగిన ఉపాయం తోచక, ఊరికే ఉండేవాడు- దీర్ఘసూత్రుని మాదిరి,

తప్పకుండా ఎప్పుడో ఒకప్పుడు ఆపదల పాలవుతాడు" అని చెబుతూండగానే, 'శత్రు దేశంలో ఏం జరిగిందో కనుక్కొనిరమ్మని' పంపబడిన ధవళాంగుడు వెనక్కు వచ్చాడు.

ఆ కొంగ హంసరాజును చూసి నమస్కరించి, "ప్రభూ! 'ప్రతి క్షణమూ కోటకావలి అవసరము' అని ముందుగానే విన్నవించుకున్నాను కదా! ప్రభువులవారు నా మాటలు పట్టించుకొనక ఆ పనిని పక్కన పెట్టారు. దాని ఫలితం ఇప్పుడు తెలిసివస్తున్నది. గ్రద్ద పంపించిన 'మేఘవర్ణుడు' అనే కాకి చేతనే మన కోట మొత్తం దహింపబడిందట. ఆ కాకే, మీ వద్ద 'నీలవర్ణుడు' అనే పేరుతో చనువుగా ఉండేది అని తెలిసింది. ఆ విధంగా..." అని ఇంకా ఏదో చెప్పబోయేంతలో తలఊపి, నిట్టూరుస్తూ, హంస అతని మాటలకు అడ్డంవచ్చి, "ఔనౌను. మేలు చేశాడనో, ఇష్టం అయినాడనో చెడ్డవాడిని నమ్మితే ఇట్లాగే అవుతుంది. చెట్టు కొమ్మ మీద పడుకొని నిద్రపోయినట్లు, అట్లా నమ్మిన వాడు క్రింద పడి, కాళ్ళు-చేతులు విరగ గొట్టించు-కుంటాడు. సందేహం లేదు. తర్వాత ఏం జరిగిందో చెప్పు" అన్నది.

"అట్లా మన కోటను మొత్తాన్నీ కాల్చి తనకు గెలుపు కూర్చిన మేఘ వర్ణుడిని నెమలి రాజు అనేక విధాలుగా మెచ్చుకొని, సన్మానించింది. అటుపైన అది సంతోషంగా మంత్రి వైపుకు తిరిగి, 'పనిని పూర్తి చేసి గెలుపు సాధించిన సేవకుడి పని ఊరికే పోదు. అతనికి అన్ని విధాలా మేలు కూర్చే ప్రతిఫలం ఒకటి తప్పని-సరిగా కలుగు తుంది. ఇప్పుడు మనకు ఈ మేఘవర్ణుడు చేసిన మేలూ అంతే. ఇతనినే ఆ కర్పూర ద్వీప రాజ్యానికి రాజుగా పట్టాభిషేకం చేస్తాను' అన్నది" అని చెప్పింది ధవళాంగుడు.

కొంగ ఇంతవరకూ చెప్పి ఆపగానే చిన్నబోయి, పరధ్యానంతో తన ఓటమి గురించిన ఆలోచనల్లో పడిపోయింది హంసరాజు.

(-తర్వాతి కథ మళ్ళీ చూద్దాం...)

# రైతు తెలివి

*మూలం: అభిరాం, ఐదవ తరగతి, ప్రభుత్వ ప్రాథమికోన్నతపాఠశాల, టేకుమట్ల, జైపూర్ మండలం, ఆదిలాబాదు జిల్లా.*



అనగనగా ఒక రైతు. ఆ రైతుకు ఇరవై ఎకరాల పొలం ఉండేది. పొలంలో ఆ రైతు బాగా పని చేసేవాడు. పంటలు బాగా పండించేవాడు. గౌరవంగా బ్రతికేవాడు.



ఆ రైతుకు ఐదుగురు కొడుకులు. వాళ్ళు ఏ పనీ చేసేవాళ్ళు కాదు. ఒట్టి బద్ధకస్తులుగా తయారయ్యారు.



కొంతకాలానికి రైతు ముసలివాడయ్యాడు. ఎలాగైనా కొడుకుల చేత పొలంపని చేయించాలని అనుకున్నాడు.

కొడుకులను ఐదుగురినీ పిలిచి, "నేను చాలారోజులు బ్రతకను. మీ కోసం పొలంలో బంగారం దాచి ఉంచాను. నేను చనిపోయాక తీసుకోండి. గౌరవంగాబ్రతకండి" అన్నాడు.

రైతు కొడుకులు సంబరపడిపోయారు. రైతు చనిపోయాక పొలానికి పోయి , పారలతో పొలాన్నంతా తిరగబెట్టారు. అయితే వాళ్లకు బంగారమేమీ దొరకలేదు.





బాగా నిరుత్సాహపడ్డారు వాళ్ళు. అయినా 'ఎలాగూ పొలాన్నంతా తిరగబెట్టాం కదా!' అని విత్తనాల్ని చల్లారు. విత్తనాలు మొలిచాయి. మొక్కలు బాగా పెరిగి, పంట బాగా పండింది.



అకస్మాత్తుగా అర్థమైంది వాళ్లకు: 'తండ్రి చెప్పిన బంగారం ఈ పంటే' అని. అప్పటినుండి వాళ్ళు బద్ధకాన్ని వదిలేసి, బాగా పనిచేస్తూ, గౌరవంగా బ్రతికారు!



# తిక్క కథ

*కొన్నికొన్నిసార్లు తిక్క కథలు కూడా బలేఉంటాయి. అలాంటి తిక్క కథ ఒకటి....*

*రచన: జె.వివేక్‌రెడ్డి, పదోతరగతి, అరవింద హైస్కూల్, కుంచనపల్లి.*



అది ఒక స్వతంత్ర దేశం. ఆ దేశంలో చాలా రాష్ట్రాలు ఉన్నాయి. అందులో ఒక రాష్ట్రం- మిగతావాటిలాగే అది కూడా అవినీతితో నిండిపోయి ఉన్నది. ఆ రాష్ట్రంలో ఒక అమాయకుడు ఉండేవాడు.

అన్ని రాష్ట్రాలలో లాగే ఆ రాష్ట్రంలో కూడా కరెంటు కోత ఉండేది. ఒకసారి ఆ కోత మరీ ఎక్కువైంది. దాంతో ఆ రాష్ట్రాన్ని పరిపాలించే ముఖ్యమంత్రి ఒక ప్రకటన చేశాడు. విద్యుత్తును పొదుపు చేసేందుకు, కరెంటు కోతకు తట్టుకునేందుకు రాష్ట్రంలోని ప్రజలందరూ రాత్రి వేళల్లో కిటికీలు తెరిచి పడుకోవాలని ఆ ప్రకటన సారాంశం.

దాన్ని విన్న అమాయకుడు నిజంగానే కిటికీలు

తెరిచి పడుకున్నాడు. కాసేపటి తర్వాత ఒక దోమ అతన్ని కుట్టింది. మళ్ళీ ఒక దోమ. తర్వాత ఒక దోమ. అలా ఓ రెండు వారాలయ్యేసరికల్లా అతనికి మలేరియా వచ్చి మంచాన పడ్డాడు.



'అసలు తనకొచ్చింది నిజంగానే మలేరియానా, కాదా?' అని, 'పరీక్ష చేయించుకుంటే నయం' అనుకున్నాడు అమాయకుడు. పరీక్ష కోసం ఒక ప్రభుత్వ ఆసుపత్రికి వెళ్ళాడు.

కరెంటు లేకపోవడం వల్ల ఆసుపత్రి అంతా కటిక చీకటిగా ఉంది. ఇంతలో కొంతమంది డాక్టర్లు టార్చ్ లైట్లు పట్టుకొని వస్తున్నారు. మన వాడిని చూడగానే వాళ్ళు కంగారు పడిపోయారు. వాళ్ళలో కొందరు టార్చిలైట్లను నేరుగా వాడి కళ్ళలోకే వేసి మెరిపించటం మొదలు పెట్టారు. దానికి తట్టుకోలేక, కొంత సేపటికి మనవాడు కళ్ళు తిరిగి పడిపోయాడు.

అక్కడ ఉన్న నర్సులకు వాడిని చూస్తే జాలి వేసింది. 'ఇక్కడి కంటే ప్రైవేటు ఆస్పత్రి అయితే నయం' అని వాళ్ళు 911 అంబులెన్సుకు ఫోన్ చేశారు. ఫోన్ ఎత్తిన 911 వాళ్ళు మెల్లగా చెప్పారు: "బండ్లలో డీజిల్ లేదు. మీరు మాట్లాడుతున్న ఈ ఫోను పనిచేసేందుకు కరెంటు లేకపోతే జనరేటర్ ఆన్ చేశాం. అప్పుడింక జనరేటర్లో డీజిల్ అయిపోయింది. దానికోసం బళ్ళలో డీజిల్ వాడుతున్నాం. ఇంక రెండేళ్ళవరకూ కరెంటు సరిగ్గా ఉండదు; కాబట్టి రెండు సంవత్సరాల దాకా బండ్లు కదలవు" అని.

చేసేదేమీ లేక నర్సులు అమాయకుడిని వాడి మానాన వాడిని వదిలేశారు. కొంత సేపటికి

తేరుకున్నాక కూడా వాడికి కళ్ళు సరిగ్గా కనిపించలేదు- అంతటా చీకటి అలుముకొని ఉన్నది కద, అందుకని!



మన వాడికేమో చీకట్లో పడుకునే అలవాటు లేదు. దాంతో వాడు గోడలు తడుముకుంటూనే పోయి పోయి, ఎక్కడో చిన్న దీపపు వెలుగు కనిపిస్తే ఆ గదిలోకి పోయి పడుకున్నాడు. వాడికేం తెలుసు, అది ఆపరేషన్ థియేటర్ అని? తెల్లవారు జామున వచ్చిన డాక్టర్లు వాడు ఇంకా నిద్రలేవకుండానే వాడికి కుటుంబ నియంత్రణ ఆపరేషన్ చేసేశారు. మత్తు దిగిన తర్వాత అమాయకుడు 'కుయ్యో మొర్రో' అని ఎంత మొత్తుంకుంటే మటుకు ఏం ప్రయోజనం?

అందుకని, మనం అందరం విద్యుత్తును పొదుపు చేయాలంటే చెయ్యాలి గానీ, ఊరికే తలుపులు తెరుచుకొని పడుకోకూడదు; దోమల చేత కుట్టించుకోకూడదు.

**పెద్ద బాలశిక్ష**

నవ్వు!

హాస్టల్ వార్డెన్: పిల్లలూ.. మీకు రేపు పెద్దబాలశిక్ష ఉంటుందిరా!

(అది వినగానే వెంగళప్ప కొడుకు హాస్టల్ నుండి ఇంటికి పారిపోయాడు-)

వెంగళప్ప: ఏంట్రా బాబూ, హాస్టల్ నుండి ఎందుకు పారిపోయి వచ్చావు?

కొడుకు: నాన్నా, రేపు హాస్టల్ లోని పెద్ద బాలలందరికీ శిక్షట..'మర్నాడు మా వంతేమో' అని, తెలివిగా తప్పించుకొని వచ్చేశా

వెంగళప్ప: మా నాయనే! ఎంత తెలివిరా, నీది!



# తిరిగొచ్చిన స్నేహం

*రచన: యం. లోకేశ్, 8 వ తరగతి, జడ్.పి.హెచ్.యస్.స్కూల్, సి.కె.పల్లి.*

బళ్లో ఆటల పోటీలు జరుగుతున్నాయి. పాఠశాలలో చదివే విద్యార్థులు చాలామంది ఆ పోటీల్లో ఉత్సాహంగా పాల్గొన్నారు. చెన్నేకొత్తపల్లి పిల్లలు రాజు-రవి ఇద్దరూ మంచి స్నేహితులు. వాళ్ళు కూడా పోటీలలో పాల్గొందామనుకున్నారు.

ఇద్దరూ వంద మీటర్ల పరుగు పందెంలో పాల్గొన్నారు- అయితే అందులో రాజు గెలిచాడు; రవి ఓడిపోయాడు!

మామూలుగా మన స్నేహితులు గెలిస్తే మనకయితే చాలా సంతోషంగా ఉంటుంది. కానీ రాజు గెలిచినందుకు ఎందుకనో, రవికి మాత్రం సంతోషం కలగలేదు. తను ఓడిపోవటాన్ని కూడా అతను అస్సలు భరించలేకపోయాడు. ఫలితాలు ప్రకటించాక రాజు సంతోషంగా వెతికాడు రవి కోసం. రవి అక్కడ లేనే లేడు!

ఆ తర్వాత రాజు ఎంత ప్రయత్నించినా రవి

వాడితో అస్సలు మాట్లాడలేదు. 'పోటీల పుణ్యమా' అని రాజు-రవిల మధ్య స్నేహం దెబ్బతిన్నది.



ఈ విషయమే చెబితే, రాజు వాళ్లమ్మ అన్నది- "చూడు రాజూ, పోటీల్లో ఈ సమస్య ఉండనే ఉన్నది- ఎవరో ఒకరు గెలుస్తుంటారు; మిగిలినవాళ్ళు చాలామంది ఓడిపోతుంటారు. దాన్ని తేలికగా తీసుకొని పోతుండటం మంచిది- గెలిచినందుకు నువ్వు గర్వపడకూడదు; ఓడినందుకు వాడూ కృంగిపోకూడదు. ఇప్పుడు వాడు ఎలా ప్రవర్తించినా సరే, నువ్వు మాత్రం వాడి పట్ల స్నేహంగానే ఉండు. త్వరలోనే వాడు మళ్ళీ నీ స్నేహితుడవుతాడు. సరేనా?" అని.

ఆ తర్వాత రవి కోపంతో రాజు గురించి ఎవరికి ఏం చెప్పినా, రాజు మాత్రం రవిమీద కోపం తెచ్చుకోలేదు. ఎప్పటిలాగే స్నేహంగా ఉంటూ వచ్చాడు.

అంతలో ఎండాకాలం వచ్చింది. ఒకరోజున వాళ్ల తరగతి పిల్లలందరూ బావిలో ఈతకు వెళ్ళారు. రవికి ఈత రాదు- ఆ సంగతి రాజుకు తెలుసు. మిగతా పిల్లలంతా ఈదేందుకు ఉత్సాహపడుతుంటే, రవి మటుకు బావి గట్టుమీద కూర్చుంటానన్నాడు. పిల్లలంతా వాడిని ఆ విషయం మీద ఆటపట్టించటం మొదలు పెట్టారు. చూస్తూండగానే ఎవరో వాడిని బావిలోకి నెట్టేశారు!

మరుక్షణం ఎక్కడో ఉన్న రాజు కూడా బావిలోకి దూకాడు. ఈతరాక నీళ్లలో మునకలు వేస్తున్న రవిని పట్టుకొని మెట్ల అంచుకు లాక్కు

వచ్చాడు. అందరూ కలిసి రవిని బయటికి లాగారు. రాజు రవికి ప్రథమ చికిత్స చేయటమే కాక, దగ్గరుండి వాడిని వాళ్ల ఇంట్లో వదిలి వచ్చాడు.

రాజు-రవిల మధ్య స్నేహం మళ్ళీ చివురించింది. ఇక అటు తర్వాత ఎన్నడూ వాళ్లమధ్య కోపతాపాలు తలెత్తలేదు!

నవ్వు!

**ముదురు!**

టీచర్ (కోపంగా): రాముా! సోమవారం నుండి శుక్రవారం వరకు ఐదురోజులూ- హోంవర్కు చెయ్యకుండా వచ్చి తిట్లు తిన్నావు. నీ గురించి హెడ్మాష్టరు గారికి ఫిర్యాదు చేస్తాను. నువ్వు ఏం చెప్పుకుంటావో ఆయనకే చెప్పుకో.

రాము: నేనేమంటాను సార్, శనివారం-ఆదివారం బడికి శలవలు ఇచ్చినందుకు ధన్యవాదాలు చెబుతాను, అంతే!




# అయ్యో! ఇవి ఎవరి తాళాలు!!?

*మనందరికీ కూడా ఇట్లాంటి సంఘటనలు రకరకాలవి, ఎదురవుతూనే ఉంటాయి. అవి ఎదురైనప్పుడు నవ్వు రాదు గానీ, తర్వాత వాటిని తలచుకుంటే భలే అన్పిస్తుంటుంది...*
*కథనం: రోహిత్ కోటయ్య కోగంటి, 8 వ తరగతి, రిషీవ్యాలీ స్కూల్, మదనపల్లి*

శ్రీరాం ఒకరోజున వాళ్ళ అమ్మానాన్నలతో కలిసి సినిమాకి వెళ్ళాడు. తనకు నచ్చిన ఆ సినిమా ఊరి చివర ఉన్న సినిమా హాల్లో ఆడుతున్నది. కొత్తగా కారు డ్రైవింగ్ నేర్చుకున్నాడు గదా, తనే సొంతగా కారు నడిపాడు శ్రీరాం.

హాలు బయట కారు పార్క్ చేసి, టికెట్ కౌంటర్ దగ్గరికి వెళ్ళి, టికెట్లు కొని , ఆపైన హాలు లోపలికి వెళ్ళారు. కొంచెం సేపటికి సినిమా మొదలైంది.

సినిమా మొదలైన ఐదు నిమిషాలకి శ్రీరాం కి ఎందుకో తాళాలు గుర్తొచ్చి, జేబులు తడుముకున్నాడు. కారు తాళాలు జేబులో

లేవు! వాళ్ల అమ్మని, నాన్నని అడిగాడు. 'మా దగ్గర లేవు'అని జవాబిచ్చి, మళ్ళీసినిమాలో మునిగారు వాళ్ళు.



శ్రీరాం కంగారు పడ్డాడు. లేచి, కుర్చీల కింద, జేబులలో, తను నడిచిన దారి అంతటా వెతికి వచ్చాడు. సినిమా నడుస్తున్నదిగాని, తనకు సినిమా మీద మనసు నిలవట్లేదు: "తాళాలు..తాళాలు..తాళాలు.." అని ఒకటే ఏడుస్తున్నది.

"తాళాలు దొరికాయా?" అమ్మానాన్నలు అడిగారు. "లేదు" నిరాశగా బదులిచ్చాడు శ్రీరాం.

"అయ్యో! మనం ఊరి చివర హాలుకి వచ్చాము. ఇక్కడ ట్యాక్సీలు, ఆటోలు ఏవీ దొరకవు. తిరిగి వెళ్ళడం ఎలా?" కంగారుగా అంది అమ్మ.

"కంగారు పడకండి- సినిమా చూడండి. ఇంటర్వెల్ లో వెతుకుదాం" అన్నాడు శ్రీరాం వాళ్ళ నాన్న. ఆయనకు సినిమా నచ్చింది!

"కానీ- ఎవరికైనా కారు తాళాలు దొరికాయనుకో; వాళ్ళు పోయి కారును దొంగిలిస్తే ఎలా?" అని శ్రీరాంకు అనుమానం. మాటి మాటికీ బయటకు పోతూనే ఉన్నాడు; టికెట్ కౌంటర్ దగ్గర, కారు దగ్గర వెతుకుతూనే ఉన్నాడు. ఈలోగా సినిమాకి విశ్రాంతి సమయం వచ్చింది.

ముగ్గురూ కలిసి మళ్ళీ అంతటా వెతికారు. విశ్రాంతి తర్వాత సినిమా మొదలవ్వగానే "మీరు సినిమా చూడండి- నేను బయటే ఉండి వెతుకుతుంటాను!" అంటూ అమ్మానాన్నలని హాలులోకి పంపించాడు

శ్రీరాం.

తల్లి దండ్రులు సినిమాలో మునిగిపోయారు. పాపం శ్రీరాం సినిమా చూడకుండా బయటే ఇంకా వెతుకుతూ ఉన్నాడు.



సినిమా అయిపోయింది. శ్రీరాం వాళ్ళ అమ్మ-నాన్న బయటికి వస్తున్నారు. వాళ్ళ వెనకాలే వస్తున్న ఒకతను తన ప్రక్కనున్న నలుగురు స్నేహితులతోటీ ఏదో అంటుంటే వినబడింది లీలగా- "అరె! ఇవి ఎవరి తాళాలు? నా జేబులోకి ఎలా వచ్చాయి?!" అని.

వాళ్ళు గభాలున వెనక్కి తిరిగి ఆ అబ్బాయిని అడిగారు- "మా తాళం కనిపించట్లేదండి- ఓసారి చూపించండి- అదేనేమో" అని. చూస్తే అది వాళ్ళ కారు తాళమే!

టికెట్ కౌంటర్ పైన శ్రీరాం తాళాలు పెట్టి మర్చిపోయాడట. శ్రీరాం వెనకనే టికెట్ కొన్న ఆ అబ్బాయి హడావుడిలో తాళాన్ని పొరపాటుగా జేబులో వేసుకున్నాడు. అదీ జరిగిన సంగతి.

శ్రీరాం వాళ్ళ అమ్మ-నాన్న ఆ అబ్బాయికి ధన్యవాదాలు చెప్పారు. ఆ అబ్బాయి వాళ్ళకి 'సారీ' చెప్పాడు. అమ్మానాన్నలు తాళాలు పట్టుకొని బయటికి వచ్చేసరికి ఇంకా తాళాలు కోసమే వెతుకుతూ ఉన్నాడు శ్రీరాం. వాళ్ల చేతిలో తాళాలు చూడగానే సంతోషంగా ఒక్క గెంతేసి తాళాలు లాక్కున్నాడు- "ఎక్కడ దొరికాయి?" అంటూ.

అమ్మా నాన్నా జరిగింది చెప్పారు.

పాపం శ్రీరాం ఆరోజు సినిమా చూడకుండానే ఇంటికి వెళ్ళాడు. 'సినిమాదేముందిలే, మళ్ళీ చూడచ్చు; కారు తాళాలు దొరికాయి అదే చాలు' అన్నాడు ఇంటికొచ్చాక మేం అడిగితే.



# దుంగరాజు-కొంగరాజు

*సేకరణ: కె.నాగయ్య, గువ్వలగోవిందంపల్లి*
*సౌజన్యం: చిన్నారి నేస్తం గోడపత్రిక, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా*

అనగనగా ఒక అడవిలో ఒక చెరువు ఉండేది. ఆ చెరువులో చాలా కప్పలుండేవి. అవన్నీ ఒకరోజున అనుకున్నాయి- "ఈ చెరువుకు ఒక రాజు ఉంటే ఎంత బాగుంటుంది?!" అని. అట్లా అనుకొని, అవన్నీ దేవుడిని ప్రార్థించాయి: "మాకో రాజుని ఇవ్వు దేవుడా" అని.

"కప్పలన్నీ బాగా ఆడుకునేందుకు బాగుంటుంది కదా" అని, దేవుడు ఒక దుంగని చెరువులోకి విసిరేసి "మీ రాజు ఈయనే" అన్నాడు.

కప్పలన్నీ దుంగరాజు మీదికి గెంతి, తైతక్కలాడాయి. దుంగరాజు కదల్లేదు; మెదల్లేదు. కప్పలన్నిటినీ చక్కగా ఆడుకోనిచ్చాడు.

అయితే దుంగరాజు వల్ల కప్పలకి సంతోషం కలగలేదు- " ఈ మహారాజు వట్టి మొద్దులా

ఉన్నాడు- ఈయన ఒద్దు మనకు- చురుకుగా ఉండే రాజైతేనే బాగుంటుంది" అని కప్పలన్నీ మళ్ళీ దేవుణ్ణి వేడుకున్నాయి.



"నిజంగానా?! చురుకైన రాజే కావాలా?" అడిగాడు దేవుడు.

"ఔను స్వామీ! ఇలా మొద్దులాగా పడి ఉండే రాజు బాలేదు" అన్నై కప్పలు.

"సరే, అయితే! మీకు కావలసింది ఇదిగో- ఇలాంటి రాజే!" అని దేవుడు ఒక కొంగని చెరువులోకి వదిలాడు. ఈ కొంగరాజు చురుకుగా కప్పలమీద పడి ఒక్కొక్క కప్పనే తినటం మొదలు పెట్టాడు. చూస్తూండగానే చెరువులోని కప్పలన్నీ తరిగిపోయాయి. మిగిలిన కప్పలన్నీ చాలా దు:ఖించాయి- 'చక్కని దుంగరాజుని ఇస్తే ఎంచక్కా సంతోషించక, ఇట్లాంటి రాజుని కొని తెచ్చుకున్నామేమి?' అని.

నవ్వు!

## లాంగ్ జర్నీ

వెంగళప్ప రైల్లో వెళ్తూ, వచ్చిన ప్రతీ స్టేషనులోనూ, దిగడం, పరుగున వెళ్ళి టికెట్టు కొనుక్కుని, మళ్ళీ వచ్చి రైలెక్కడం జరుగుతోంది. అలా చాలా స్టేషన్లు దాటాక పక్క వ్యక్తి అడిగాడు: ఏంటండీ, ప్రతీ స్టేషనులోనూ దిగి టికెట్టు తీసుకుంటున్నారు?

వెంగళప్ప: ఈ మధ్య నాకు ఆరోగ్యం సరీగాలేక డాక్టరు దగ్గరికెళ్తే, లాంగ్ జర్నీలు వద్దని చెప్పారండి. అప్పటినుండి దూర ప్రయాణాలు చెయ్యట్లేదు. అన్నీ చిన్న చిన్న ప్రయాణాలే!




# కష్ట ఫలితం

*చక్కగా చదువుకోవటం, మంచి అలవాట్లు కలిగి ఉండటం- ఇవి మన కష్టాలను దూరం చేస్తాయి. నిజం. ఈ కథ చదవండి మరి..*

*రచన: జయదుర్గ, ఏడవ తరగతి, మిర్యాలగూడ, నల్గొండ జిల్లా.*



పెద్దపల్లిలో నివసించే సోమన్న చాలా పేదవాడు. అతనూ, అతని భార్య అంజలి ఇద్దరూ శ్రమజీవులు. వాళ్ల కొడుకు రాము తెలివైనవాడు; చక్కగా చదువుకునేవాడు. వాళ్ళకు ఉండే ఆస్తల్లా ఒక ఇల్లే. ఆ ఇల్లు గడవటం కోసం ఏ రోజున కూలి దొరికితే ఆ రోజున భార్యా భర్తలిద్దరూ పనికి పోతుండేవాళ్ళు. వాళ్ల అదృష్టం కొద్దీ రాము కూడా బాధ్యతగా చదువుకునేవాడు; చాలా పొదుపుగా ఉండేవాడు.

వాళ్ళ ఇంటి ప్రక్కనే ఒక డాబా ఇంట్లో నివసించేవారు, వెంకన్న- అతని భార్య శ్రీదేవి. వాళ్ల పిల్లలు పవన్, ప్రసన్న ఇద్దరూ పట్నంలో పెద్ద హాస్టలులో ఉండేవాళ్ళు. వెంకన్న, శ్రీదేవి ఇద్దరూ ఎప్పటికప్పుడు వాళ్ళకు చాక్లెట్లు,

బిస్కెట్లు, కేకులు తీసుకెళ్లటం, ఏమడిగితే అవి కొనివ్వటం చేసేవాళ్ళు. వాళ్ళు కూడా చాలా దుబారాగా ఉండేవాళ్ళు. చీటికీ మాటికీ తల్లిదండ్రులను కారు తీసుకొని రమ్మనేవాళ్ళు. పార్టీలనీ, పిక్నిక్కులనీ జల్సాగా ఉండేవాళ్లు.

"మరీ అంత పిసినారుల్లాగా ఎందుకుంటారు మీరు? పాపం మీ పిల్లవాడికి పుట్టినరోజన్నా సరిగ్గా చేయరే?" అని సోమన్న మీద జాలి కురిపించేవాళ్ళు వెంకన్న-శ్రీదేవి. "మాదగ్గర ఉన్నది ఇంతేనండి- ఉన్నంతలో సర్దుకుపోకపోతే అప్పుల పాలైపోతాం" అనేవాడు సోమన్న. ఎప్పుడైనా రాముకు ఇలాంటి సంగతులు తెలిస్తే "మనకి నచ్చినట్లు మనం ఉంటాం నాన్నా, దండగ ఖర్చులు ఎందుకు చేస్తాం? అయినా వాళ్లకెందుకుట, ఇవన్నీ?!" అనేవాడు.

చూస్తూ చూస్తూండగానే పిల్లలంతా పెద్దవాళ్లయ్యారు. పవన్, ప్రసన్న ఇద్దరూ ఫ్యాషన్లనీ, పోజులనీ ఇంట్లో డబ్బంతా తీసుకెళ్ళి ఖర్చు పెడుతూనే ఉన్నారు. వయసుతోబాటు వాళ్ల ఖర్చులూ పెరిగాయి; వాళ్ల అలవాట్లూ మారాయి. చెడు అలవాట్లు చాలా చోటు చేసుకున్నాయి.

వెంకన్న, శ్రీదేవి ఇప్పుడు వాళ్లని "డబ్బులు ఇలా తగలేస్తారేమిటి, డబ్బులు చెట్లకు కాయవు" అనిఏమన్నా అంటే వాళ్ళు కొట్టినంతపని చేస్తున్నారు. 'రోజూ ఇంత డబ్బు ఇవ్వాల్సిందే' అని షరతులు విధిస్తున్నారు. వాళ్ళ ఇంట్లో ఈనాడు డబ్బుంది; కానీ సంతోషం పూర్తిగా కరవు అయ్యింది.



ఇక రాము చక్కగా చదువుకొని పెద్ద ఇంజనీరు అయ్యాడు. పేరున్న కంపెనీవాళ్ళు అతనికి చాలా జీతంఇచ్చి పనిలో పెట్టుకున్నారు. తనకున్న మంచి అలవాట్లతో ముసలి

తల్లిదండ్రులకు సాయంగా నిలిచాడు రాము. ఇప్పుడు కూడా సోమన్న, అంజలి దుబారాగా లేరు- కష్టాలు తీరినందుకు, మంచి రోజులు వచ్చినందుకు సంతోషంగా ఉన్నారు. రోజూ తమకు చేతనైనంత పని చేస్తూ, పదిమందికీ సాయపడుతూ హాయిగా బ్రతుకుతున్నారు. కష్టానికి ఫలితం వృధా పోదు.

మంచి పద్యం

చదువని వాడజ్ఞుండగు
చదివిన సదసద్వివేక చతురత గలుగున్
చదువగ వలయును జనులకు
చదివించెదనార్యులొద్ద, చదువుము తండ్రీ!

ఆంధ్ర మహా భాగవతంలోని పాత్రల చేత పోతన చెప్పించిన గొప్ప పద్యాల్లో ఇది ఒకటి.

హిరణ్యకశ్యపుడు తన కొడుకు ప్రహ్లాదుడిని గురువుల దగ్గరికి పంపిస్తూ అంటున్నాడు- "బాబూ! చదవనివాడికి విషయాలే తెలీదు. మరి చదివితే ఏమవుతుంది? మంచి-చెడుల మధ్య తేడా ఏంటో తెలుసుకోగలిగే శక్తి వస్తుంది. అందువల్ల అందరూ చదువుకోవాలి. నిన్ను నేను మంచి గురువుల దగ్గర ఉంచి చదివిస్తాను నాయనా, చక్కగా చదువుకో!" అని.

ఈ పద్యం బాగా చదువుకోవాలని చెప్పటమే కాదు; చదువు ఎలా ఉండాలో చెబుతున్నది కూడాను- చదువు ఏం చెయ్యాలటనో చూశారా? అది మంచి-చెడుల మధ్య తేడా ఏంటో తెలుసుకునే శక్తినివ్వాలట! అంటే మనం చదువుకొని, మంచేంటో-చెడేంటో తెలుసుకోవాలన్నమాట!




# ఉపాయం

*అపాయంనుండి తప్పించుకోవాలంటే, ఉపాయం ఉండాలి! ఇదిగో, అట్లాంటి ఉపాయపు కథ ఒకటి! అయితే మరి ఈ ఉపాయం పని చేయాలంటే కాకికి వేడి అంటకూడదు!*



*రచన: రవితేజ, ఏడవ తరగతి, శ్రీచైతన్య టెక్నో స్కూలు, మొగల్రాజపురం, విజయవాడ*

అనగా అనగా ఒక అడవిలో మిణుగురు పురుగు ఒకటి ఉండేది.

అది అడవిలో స్వేచ్ఛగా, సంతోషంగా తిరుగుతూ హాయిగా కాలం గడిపేది.

ఒకరోజు రాత్రి కాకి ఒకటి వచ్చి దాన్ని మింగబోయింది.

"ఆగు- నా మాటలు వింటే నీకే లాభం" అంటూ గట్టిగా అరిచింది మిణుగురు పురుగు.

'సరే, ఇది ఏం చెబ్తుందో చూద్దాం" అనుకున్న కాకి దాన్ని మింగటం ఆపి- "సరే,చెప్పు, ఏం చెబుతావో చూస్తాను" అన్నది.

నువ్వు ఇప్పుడు నన్ను తినకుండా వదిలేశావంటే, తెల్లవారు జామునే నీకు

బోల్డన్ని మిణుగురు పురుగులు ఉండే చోటొకటి చూపిస్తాను. అక్కడ నీకు కావలసినన్ని మిణుగురు పురుగులు ఉంటాయి; నువ్వు కడుపు నిండా హాయిగా తినొచ్చు!" అంటూ ఊరించింది.



కడుపునిండేన్ని మిణుగురు పురుగులనేసరికి, కాకికి ఆశ మొదలైంది. "దాని మాటలు నమ్ముదాం" అనిపించింది. "కావాలంటే ఆ తర్వాతే తింటాను దీన్ని!" అనుకున్నది. పైకి మటుకు "సరే, చూపించు!" అన్నది.

మిణుగురు పురుగు కాకిని అడవి అంచుకు తీసుకెళ్ళింది. అక్కడ, ఊళ్ళో జనాలు కొందరు కూర్చొని వెచ్చగా చలికాగుతున్నారు- వాళ్ళకెదురుగా పెద్ద చలిమంట ఒకటి, రగులుతున్నది. చలిమంట మీదినుండి, కొన్ని నిప్పురవ్వలు పైకి ఎగురుతున్నాయి- అచ్చం మిణుగురులలాగానే!

మిణుగురుపురుగు కాకి వైపుకు చూస్తూ ఉత్సాహంగా "చూడు! ఎన్ని మిణుగురు పురుగులో! నీ ఆకలి తీర్చుకో, ఇంకెందుకు ఆలస్యం?" అన్నది.

నిప్పు రవ్వలను 'మిణుగురు పురుగులు' అనుకున్న కాకి ఆత్రంగా నోరు తెరుచుకొని పోయి, గబగబా ఓ పది నిప్పు రవ్వల్ని మ్రింగేసింది. దాని నోరు చురుక్కుమనటమే కాదు, ఇంక నెలరోజులపాటు అది ఏమీ తిననే లేని పరిస్థితి ఏర్పడ్డది!

ప్రాణాలు కాపాడుకున్న మిణుగురు పురుగు వెంటనే అక్కడినుండి తప్పుకున్నది!

నేర్చుకో!

ఉపకారికి నుపకారము విపరీతము కాదు సేయ వివరింపంగా
అపకారికి నుపకారము నెపమెన్నక సేయువాడు నేర్పరి సుమతీ!



# వదిలిన బద్ధకం

*రచన: కరిపినేని అపరాజిత, 4 వతరగతి, రిషీవ్యాలీ స్కూల్, మదనపల్లి.*



అనగనగా ఒక పల్లెటూరు. ఆ ఊళ్ళో వాళ్ళందరూ బద్ధకస్తులు. ఆ పల్లెలో పక్క పక్క ఇళ్ళల్లో ఒక ఆవు, కోడిపుంజు చాలా స్నేహంగా ఉండేవి. ఈ పల్లె వాళ్ళకి వాటికి మేత వేయడానికి కూడా బద్ధకం.

అయినా కోడిపుంజు రోజూ పొద్దున్నే సమయానికి కూసి మనుషులను నిద్ర లేపేది. ఆవు చాలా చాలా పాలు ఇచ్చేది. అవి రెండూ ఒకచోట చేరినప్పుడల్లా 'ఎందుకు, ఈ ఊరి వాళ్ళు ఇంత బద్ధకంగా ఉన్నారు?' అని బాధ పడేవి.

ఆ రెండు ఇళ్ళ మధ్య ఉన్న చింతచెట్టు కింద కూర్చుని తాళ్ళు పేనుకునే తాత "మా కాలంలో మేము ఎంత పని చేసే వాళ్ళం?! మీరు గొంతు పోయేట్లు కూసినా ఇప్పటి ఈ జనాలు లేవరు; లేచినా పనులు చేయరు. ఆవులు పాలు ఇస్తున్నాయి కాబట్టి వీళ్ళకి కడుపు నిండుతోంది. ఇంకెందుకు

పనిచేస్తారు వీళ్ళు?!" అంటూ ఆవునీ, కోడినీ చూస్తూ ఎప్పుడూ గొణుక్కుంటూ ఉండేవాడు.

"మనం మనుషులకి సహాయం చేస్తున్నాం కాని వాళ్ళు మనకు సహాయం చేయడం లేదు" అంది ఒకరోజు కోడిపుంజు ఆవుతో.

"ఔను. వాళ్ళు కనీసం మనకు మేత కూడా వెయ్యడం లేదు. మనమే మన తిండి వెతుక్కుని తింటున్నాం" అంది ఆవు బాధగా.



"వీళ్ళకు బుద్ధి వచ్చేట్లు చేయాలి. నేను మా వాళ్ళందరికీ కూయడం ఆపేయమని చెప్తాను. నువ్వు మీ వాళ్ళందరికీ పాలు ఇవ్వడం ఆపేయమని చెప్పు" అంది కోడిపుంజు.

"సరే" అని ఆవు ఒప్పుకుంది.

ఆ తర్వాతి రోజు నుంచీ ఊళ్ళో ఉన్న కోళ్ళన్నీ కూయడం మానేశాయి. ఆవులన్నీ పాలు ఇవ్వడం మానేశాయి. దానితో అందరూ చాలా ఇబ్బంది పడ్డారు. ఏమయిందో తెలుసుకోవాలని అందరూ ఒకచోట చేరారు. "ఏమయింది? ఎందుకని మన ఆవులు పాలు ఇవ్వడం లేదు?" అని ఒకరు అడిగారు.

"అయ్యో! ఆవులేనా, కోళ్ళు కూడా గుడ్లు ఇవ్వడం లేదు. అసలు పొద్దున్నే కూయడానికి కూడా వాటికి చాలా బద్ధకంగా ఉంది!" అన్నారు మరొకరు.

"అంటే వాటికి కూడా మన బద్ధకం రోగం అంటుకుందన్నమాట! ఇప్పటికైనా ముందు మనం మన రోగం వదిలించుకొని, పనులు చేసుకుందాం. వాటికింత దాణా వేసి చూద్దాం- అప్పుడైనా అవి పాలూ, గుడ్లూ ఇస్తాయేమో!" అన్నాడు తాత, మంచంలో నుండి.

తాత మాటలకి అందరూ సిగ్గుతో తలవంచుకున్నారు. ఆరోజు నుండీ వాళ్ళు కష్టపడి పనులు చేసుకోసాగారు. ఆవులకీ, కోళ్ళకీ మేత వేయడం మొదలు పెట్టారు. వాళ్లలో మార్పుని చూసిన తాత సంతోషపడ్డాడు. తర్వాతి రోజునుండీ ఎప్పటికంటే ఎక్కువ పాలని ఇస్తున్న ఆవులనీ, ఇంకా పెందరాళే కూస్తున్న పుంజులనీ చూసి అందరూ ఆశ్చర్యపోయారు.

"మీకు బుద్ధి రావాలనే ఈ మూగ జంతువులు ఇలా చేసి ఉంటాయి!" అన్న తాత మాటలు విని, ఆ ఊరి జనం బద్ధకాన్ని పూర్తిగా వదిలించుకున్నారు.

నవ్వు!

**చల్లని బాబు!**

సతీష్: నాన్నా! మా క్లాసులో అందరూ చందమామ మీదకు వెళ్తామన్నారు; నేను మాత్రం సూర్యుడి మీదికి వెళ్తానని చెప్పా!

తండ్రి: అదెట్లా వీలవుతుందిరా? అక్కడికి వెళితే కాలిపోతావుగా?

సతీష్: అయ్యో! నీక్కూడా అర్థం కాలేదా నాన్నా?! నేను వెళ్ళేది రాత్రి పూటే!

**మా నాయనే!**

సురేష్ సెకండ్ షో సినిమా చూసి అర్ధరాత్రి దాటాక ఇంటికి వచ్చాడు.

అమ్మ(కోపంగా) : ఎక్కడికి వెళ్ళావురా?

టింకూ: 'అమ్మప్రేమ' సినిమా చూడడానికి వెళ్ళానమ్మా!

**వీరుడు!**

రాజు: నేను ఒక సింహం కాలు, ఏనుగు తొండం, గాడిద ముక్కు విరగొట్టాను.

ఆనంద్: వావ్! అప్పుడు ఏమైంది?

రాజు: ఏమవుతుంది? షాపులో బొమ్మలు విరగ్గొట్టినందుకు షాపతను బాగా కొట్టాడు- ఇప్పటివరకు ఆ నొప్పి తగ్గలేదు...!



# సీతమ్మ వాకిట్లో నాణ్యమైన కుండలు

*రచన: యం అభిషేక్, పదవ తరగతి ఎ, ప్రభుత్వ ఉన్నత పాఠశాల, నరసన్నపేట, శ్రీకాకుళం జిల్లా*

ఒక ఊళ్ళో రంగయ్య అనే కుమ్మరి ఉండేవాడు. అతను కుండల్ని, పొయ్యిల్ని తయారు చేసేవాడు. అతని భార్య సీతమ్మ , కొడుకు రాము. సీతమ్మ ఆరవ తరగతి వరకే చదివింది. కానీ ఆమెకు లోకం తీరు తెలుసు. చాలా చురుకుగా ఉండేది. ఎలాంటి చిక్కు సమస్యనైనా సులువుగా పరిష్కరించేది.

ఒక రోజున సీతమ్మ సరుకులు కొనుక్కొని తిరిగి ఇంటికి వస్తుండగా దారిలో ఒక పావురం పిల్లని కాకులన్నీ పొడవటం చూసింది. చిట్టి పావురం అవస్థని చూసే సరికి ఆమెకు జాలి వేసింది. కాకుల్ని అదిరించి, ఆ పావురాన్ని ఆమె ఇంటికి తెచ్చింది. అనుకోకుండా ఆనాడే రాము పుట్టినరోజు. సీతమ్మ ఇంటికి వచ్చేసరికి వాడు తల్లి తనకోసం ఏమి తెస్తుందోఅని ఎదురుచూస్తూ ఉన్నాడు.

సీతమ్మ చిట్టి పావురాన్ని వాడికి ఇచ్చేసరికి వాడి ఆనందానికి మేరలేదు. త్వరలోనే వాడు దానికి స్నేహితుడు ఐపోయాడు. రోజూ బడికి వెళ్ళి రాగానే దానితో ఆడుకునేవాడు.



ఆరోజే రాము తన స్నేహితుల గుంపుకు తమ ఇంట్లో పావురం ఉందన్న సంగతిని గొప్పగా చెప్పేశాడు. వాడి స్నేహితుల్లో ఒకడు రమేష్. వాడికి 'ఇంట్లో పావురం' అనే ఆలోచన చాలా నచ్చింది- రోజూ వచ్చి పావురంతో ఆడుకొని పోసాగాడు. రాను రాను రాము కంటే వాడే పావురానికి దగ్గరయ్యాడు. ఎంత దగ్గరయ్యాడంటే, వాడి పుట్టిన రోజునాడు రాము వాడికి తన పావురాన్ని బహుమతిగా ఇచ్చాడు!

అలా రాము-రమేష్ ల స్నేహం బాగా గట్టిపడింది. అంతలో అనుకోకుండా రంగయ్యకు పెద్ద జబ్బు చేసింది. ఆసుపత్రిలో చేర్పించీ ప్రయోజనం లేకపోయింది. చూస్తూండగాన్నే రంగయ్య చనిపోవటం, కుటుంబ బాధ్యత మొత్తం సీతమ్మ మీదే పడటం జరిగిపోయింది.

కుండలు తయారు చేయటం చాలా బరువుతో కూడుకున్న పని. సీతమ్మ ఒక్క క్షణం ఆలోచించింది- 'రాము చదువు మాన్పిద్దామా' అని. అయితే ఆమెకు అది ఇష్టం లేకపోయింది. రాముని బడికి పంపిస్తూ తనొక్కతే కుండలు చేయలేదు. అందుకని ఆమె కుండల తయారీని పూర్తిగా ప్రక్కన పెట్టి, ఊళ్ళో ఇళ్లలో పనిమనిషిగా చేరి ఒక్కతే సంసారాన్ని లాక్కురావటం మొదలుపెట్టింది.

ఈ సంగతి తెల్సిన రమేష్ తల్లిదండ్రులు చాలా బాధపడ్డారు. వాళ్ళకు ఊళ్ళోఒక చిన్న బట్టల దుకాణం ఉంది. ఎలాగైనా సీతమ్మ తన కాళ్లమీద తను నిలబడేట్లు చేయాలని

అనుకున్నారు వాళ్ళు. ఒకనాడు రాము వాళ్ల ఇంటికి వచ్చినప్పుడు "రామూ! మీ అమ్మ ఇప్పుడు ఏం చేస్తోంది?" అని అడిగింది రమేష్ వాళ్లఅమ్మ.

"మా నాన్నగారు పోయాక, ఇప్పుడు మా అమ్మ ఊళ్ళో ఇళ్లల్లో పనిమనిషిగా ఉంటోందండి" అన్నాడు రాము వినయంగా.

"మీ అమ్మకు కుండలు చెయ్యటం రాదా?" అడిగాడు రమేష్‌వాళ్ళ నాన్న.

"వచ్చండి! కానీ వేరే కూలి మనిషిని పెట్టుకోవాలంటే డబ్బులు లేవు కదండి, అదీ కాక కుండల్ని సంతలో పూర్తిగా అమ్మలేము- ఇల్లిల్లూ తిరిగి అమ్మాలంటే మా నాన్న లేకుండా వీలవ్వదు కదా" అన్నాడు రాము.

"ఒకసారి మీ అమ్మను వచ్చి కలవమను- కుండల తయారీలో సాయపడే మనిషి ఒకడిని కొన్నాళ్లపాటు నేను ఏర్పాటు చేస్తాను. మా దుకాణం ముందు కుండలు అమ్మే వసతీ కల్పిద్దాం..కుండలు మరి నాణ్యంగా ఉంటేనే సుమా?!" అన్నాడు రమేష్‌వాళ్ల నాన్న.

రాము ఈ సంగతి చెప్పగానే సీతమ్మకు చక్కని ఆసరా దొరికినట్లయింది. ఆమె వెళ్ళి రమేష్ వాళ్ళ ఇంట్లో మాట్లాడి, కుండల తయారీ మొదలు పెట్టింది. ఆమెకున్న అనుభవంతో చక్కని కుండలు తయారు చేసింది. రమేష్ వాళ్ల అమ్మ, నాన్న ఆమెకు వ్యాపారంలో సాయపడ్డారు. త్వరలోనే కూలి మనిషి ఖర్చులు స్వయంగా పెట్టుకోగలిగిందామె. ఊళ్ళోఅందరూ ఆమె కుండల నాణ్యతను మెచ్చుకోవటం మొదలుపెట్టారు.



"సీతమ్మా! ఇప్పుడు నీ వ్యాపారం నిలదొక్కుకున్నట్లే. జనాలు మీ ఇంటికే వచ్చి

కుండలు కొనుక్కెళ్తారు. కాబట్టి ఇప్పుడు కుండల్ని మీ ఇంటి చావడిలోనే పేర్చి పెట్టు- వ్యాపారం బాగా నడవకపోతే మళ్ళీ మా దుకాణం ముందు పెట్టుకుందువులే" అన్నాడు రమేష్‌వాళ్ల నాన్న.

ఆయన సలహా మేరకు సీతమ్మ తన కుండల వ్యాపారాన్ని తన ఇంటికే మార్చింది. ఇప్పుడు సంత సమయంలోనే కాదు, ఎప్పుడు కావాలంటే అప్పుడు చక్కని కుండలు లభిస్తున్నాయి. ఎందుకంటే సీతమ్మ ఇంటి ముందున్నై, అందమైన కుండల వరసలు!

ఊళ్ళో ఎవరికి కుండలు కావాలన్నా, పొయ్యిలు కావాలన్నా మొదట గుర్తు వచ్చేది సీతమ్మే!

నవ్వు!

**పిచ్చి కథ!**

ఒక సైనికుడు రాత్రిపూట నడుస్తూ, పొరపాటున నీళ్లులేని బావిలో పడిపోయి, బిగ్గరగా కేకలేశాడు. దగ్గర్లోనే ఉన్న జూనియర్ ఆఫీసర్‌కి ఆ అరుపులు వినబడ్డాయి.

వెంటనే బావి దగ్గరికి వెళ్ళి, ఒక తాడు చివరను తను పట్టుకొని, మరో చివరను బావిలోకి విసిరాడు. "దాన్ని పట్టుకో! పైకిఎక్కి రా" అని అరిచాడు.

సైనికుడు తాడు పట్టుకుని మెల్లగా బావి పైకి వచ్చాడు. ఇంకా పైకి ఎక్కకనే జూనియర్ ఆఫీసర్‌ను చూసి, అలవాటు ప్రకారం సెల్యూట్ చేసాడు! మళ్ళీ దఢాలున బావిలో పడిపోయాడు.

"నాకు సెల్యూట్ చెయ్యద్దు" అన్నాడు జూనియర్ ఆఫీసర్, మళ్ళీ త్రాడును లోనికి వదుల్తూ.

ఈసారి సైనికుడు తాడు పట్టుకొని జాగ్రత్తగా పైకి రాసాగాడు.

అంతలోనే సీనియర్ ఆఫీసర్ ఒకాయన ఆత్రుతతో బావి దగ్గరకు వచ్చాడు.

ఆయన్ని చూడగానే ఈసారి జూనియర్ ఆఫీసర్ తాడును వదిలేసి, ఆయనకు సెల్యూట్ చేశాడు- మళ్ళీ మరో దఢాల్!

# ఎలుక తెలివి

*పంచతంత్రంలో పిల్లి-ఎలుకల కథ చదివారుగా, అదే పంథాలో నడిచే ఈ కథ చదివి ఎలా ఉందో చెప్పండి...*

*కె.జగదీష్, 8 వ తరగతి, జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, చెన్నేకొత్తపల్లి.*





అనగా అనగా ఒక అడవిలో ఒక కుందేలు, ఒక ఎలుక ఉండేవి. అవి రెండూ చాలా మంచి స్నేహితులు. కుందేలు ఒక చిట్టి పొదలో ఉండేది; ఎలుక ఆ పొద క్రిందుగానే ఓ బొరియలో నివసించేది.

ఒక రోజు అవి రెండూ నడచుకుంటూ పోతున్నాయి. దారిలో వాటికి ఒక పులి కనిపించింది. దాన్ని చూడగానే అవి రెండూ చాలా భయపడ్డాయి. కానీ చూస్తే, పులి కదిలేందుకు లేదు; మెదిలేందుకు లేదు. వేటగాడు జంతువుల్ని పట్టుకోవటం కోసం పరచిన వలలో చిక్కుకొని ఉన్నది అది.





కుందేలు, ఎలుక దాన్ని చూసి "అయ్యో పాపం" అనుకున్నాయి. ఇంతకీ పులిని పట్టుకొని పోయి ఏంచేస్తాడు ఈ వేటగాడు?" అడిగింది ఎలుక, కుందేలును.

"పులిని సర్కసు వాళ్లకు అమ్మేస్తాడు. వాళ్ళు దాన్ని బాగా ఏడిపించి, డాన్సు చేయటం, మంటల్లోంచి దూకటం- ఇట్లాంటివన్నీ నేర్పిస్తారు. అటుపైన వాళ్ల ప్రదర్శనల్లో ఎలా చెబితే అలా చెయ్యాలి ఇది" వివరించింది కుందేలు. "మాఅమ్మ ఇదివరకు సర్కసులోనే ఉండేది. నేను ఎలాగో అక్కడినుండి తప్పించుకు వచ్చాను గానీ" అని చెప్పింది విచారంగా.



"మరయితే దీన్ని విడిపించమంటావా, నా పళ్ళు బలే పదునుగా ఉంటాయి కదా, కావాలంటే వలను కొరికెయ్యగలను నేను" అన్నది ఎలుక.

"అమ్మో! ఇంకా నయం, పోయి సింహాన్నే కొరుకుతాననలేదు. దగ్గరకు వెళ్తే ఈ పులి కాస్తా నిన్ను గుటుక్కున మింగేస్తుంది జాగ్రత్త, ఏమనుకుంటున్నావో ఏమో" అంది కుందేలు.

"నేనేమీ అనను. నన్ను విడిపించు ప్లీజ్! నాకు సర్కసులో పనిచేయాలని అస్సలు లేదు!" అన్నది పులి, వలలోనే గింజుకుంటూ.



అంతలోనే ఒక నక్క పొదచాటు నుండి ఎలా వచ్చిందో వచ్చింది. తటాలున కుందేలు మీదికి దూకింది. కుందేలు భయంతో గజగజా వణుకుతూ పొద చుట్టూ పరుగెత్తటం మొదలు పెట్టింది. నక్క దాని వెంట పడింది "ఆగవే, నానుండి ఎలా తప్పించుకుంటావో చూస్తాను..ఎక్కడికెళ్ళినా నానుండి తప్పించుకోలేవు" అంటూ.

అట్లా కుందేలు పొదకు ప్రదక్షిణలు చేస్తుంటే చూసిన ఎలుకకు ఒక ఉపాయం తట్టింది. గబ గబా పోయి పులి చిక్కుకున్న వలను పళ్ళతో కొరికి ముక్కలు చేసేసింది.



వలలోంచి బయట పడిన పులి సంతోషంగా గాండ్రిస్తూ నక్క మీదికి దూకింది. పులిని చూసి భయపడిన నక్క, కుందేలు సంగతి మర్చిపోయి ఎటో పరుగెత్తింది.

మరుక్షణం ఎలుక బొరియలోకి దూరింది; కుందేలు పొదలోకి పారిపోయింది; పోబోయిన ప్రాణాలు దక్కాయన్న సంతోషంతో పులి తన గుహకేసి పరుగు పెట్టింది!



# బద్ధకం

*ఇంతకీ మీకు వచ్చా, సుడోకులు పరిష్కరించటం? ఇదిగో, ఈ కథ చదవి చూడండి!*

*రచన: కె.మల్లికార్జున, కొత్తపల్లి బృందం, చెన్నేకొత్తపల్లి.*

అనగనగా ఒక ఊరిలో రాజీవ్ అనే ఒక పిల్లవాడు ఉండేవాడు. రాజీవ్ చాలా మంచి పిల్లవాడు. కాని ఎప్పుడు మొదలయ్యిందోగాని, వాడికి ఒకే ఒక చెడ్డ అలవాటు అంటుకున్నది: అదేమిటంటే, బద్ధకం!

ఏ పనినైనా 'తరువాత చేద్దాంలే' అనుకుంటాడు. వాళ్ల అమ్మావాళ్ళు ఎన్ని సార్లు చెప్పినా, వాడి తీరు మటుకు మారేది కాదు.

మొదట్లో వాడు చాలా చురుకుగానే ఉండేవాడు. బడిలో ఎవరు ఏ ప్రశ్న అడిగినా చటుక్కున సరైన సమాధానం చెప్పేసేవాడు. అయితే ఈ బద్ధకం మొదలయ్యాక వాడు

చదువులో కూడా వెనకబడి పోయాడు. ఎప్పటి లాగానే రోజూ బడికి వెళ్ళేవాడు; కానీ బడి నుండి వచ్చిన తరువాత ఇక పుస్తకాలు ముట్టేవాడు కాదు. చదువుకునేవాడు కాదు; హోం వర్కు కూడా చేసుకునేవాడు కాదు. 'రేపు చేస్తానులే!' అనేవాడు. మరి ఆ 'రేపు' ఎంతకీ వచ్చేది కాదు!

వాడు ఎనిమిదో తరగతిలో ఉండగా వాళ్ళింటికి వచ్చాడు, సూర్యం మామయ్య. సూర్యం మామయ్య పొరుగూరులో ఉపాధ్యాయుడు. రాజీవ్‌ని చూడగానే వాడి సమస్య ఏంటో గుర్తించాడాయన. "ఒరే, అల్లుడూ! నాకు ఓ వ్యసనం అంటుకున్నదిరా! ఏరోజుకారోజున పేపర్లో వచ్చే 'సుడోకు'; ఆదివారం పదరంగం- ఇవి చేయకుండా ఉండలేకపోతున్నాను. ఇవాల్టి పేపరూ, పోయిన ఆదివారం ప్రత్యేకమూ- ఇవ్వరాదూ, కొంచెం" అన్నాడు రాజీవ్‌తో.

రాజీవ్‌కి అప్పటివరకూ 'సుడోకు' గురించి తెలీదు. సూర్యం మామయ్య ప్రయత్నిస్తుంటే చూసి వాడూ కొంచెం కొంచెంగా నేర్చుకున్నాడు. అటుపైన మామయ్య వాడికోసం అంతకు ముందు సుడోకులూ కొన్ని చేసిపెట్టాడు- వివరణలు ఇస్తూ. ఇద్దరూ కలిసి కూర్చొని ఆదివారం పదరంగాలూ పరిష్కరించారు. ఇంకేముంది, రాజీవ్‌కి కూడా సుడోకుల వ్యసనం, పదరంగాల వ్యసనం అంటుకున్నది. ఏ రోజుకారోజు సుడోకు లూ, ఏ వారానికావారం పదరంగాలు చేయకుండా ఉండలేని పరిస్థితి వచ్చేసింది త్వరలోనే.



ఏనాడైనా సుడోకు సాధించలేక పోయినా, పదరంగం పరిష్కరించలేకపోయినా వాడు సూర్యం మామయ్యకు ఫోన్ చేసి ఎలా

చెయ్యచ్చో అడగటం కూడా మొదలు పెట్టాడు. సూర్యం మామయ్య కూడా అప్పుడప్పుడూ ఫోన్ చేసి 'ఈరోజు సుడోకు భలే ఉందిరా!" అనో, "నిన్నటి పదరంగంలో నిలువు ఆరు ఉంది చూశావూ..?" అనో అనటం మొదలుపెట్టాడు.

ఈ క్రమంలో రాజీవ్‌కు తెలీకుండానే ఓ మాయ జరిగింది. ఏరోజుకారోజు పనిచేయటం అలవాటైనకొద్దీ, వాడి బద్ధకం ఎటుపోయిందో, పోయింది!

బద్ధకం వదిలించుకున్న రాజీవ్ పదో తరగతి మంచి మార్కులతో పాసయ్యాడు. వాడి ప్రగతిని గమనిస్తున్న సూర్యం మామయ్య నవ్వుకుంటూ అడిగాడు "ఒరే సూర్యం! పదో తరగతిలో మంచి మార్కులు రావాలంటే ఏం చెయ్యాలిరా?" అని.

"ముందు ఎలాగైనా చేసి, బద్ధకాన్ని వదిలించుకోవాలి మామయ్యా! చదువుకి బద్ధశత్రువు, బద్ధకం!" అన్నాడు సూర్యం, తడుముకోకుండా. వాడి బద్ధకం ఎలా పోయిందో వాడికి ఇంకా తెలీదు మరి!

**హోటల్ వారి అబ్బాయి!**

టీచర్: ఒరేయ్ వినయ్, పౌష్ఠికాహారం, సంపూర్ణాహారం అంటే ఏమిటి?

వినయ్: పౌష్ఠికాహారం అంటే ప్లేట్మీల్స్, సంపూర్ణ ఆహారం అంటే ఫుల్‌మీల్స్ టీచర్.

**అనుమానపు పక్షి!**

టీచర్: సాయీ! 55 అంకెను పలకమీద రాసి చూపించు.

సాయి: ఎలా రాయాలి టీచర్?

టీచర్: చాలా సులభం కదరా?! 5 పక్కన మరో 5 వేయడమే!

సాయి: ఏవైపు టీచర్! కుడివైపా, ఎడమవైపా?



# అశోక వనంలో సీత

*"చెడు ఎంత బలంగా ఉన్నా, ఎన్ని కష్టాలు ఎదురైనా, ఆ పీడనను మన నిబ్బరంతో బలీయంగా ఎదిరించవచ్చు. చెడుతో రాజీపడటం అంటే మంచిని వంచన చేయటమే! చెడుని ద్వేషించాల్సినంతగా ద్వేషించకపోతే, మంచిని ప్రేమించాల్సినంతగా ప్రేమించలేం!" అని రాస్తున్నారు నాగరాజుగారు- చదవండి...*

*కథనం: పి యస్ నాగరాజు, ప్రజాసాహితి*

అది అశోకవనం. అంతమంది రాక్షసుల మధ్య ఒంటరిగా కూర్చొని దు:ఖిస్తూ ఉన్నది సీత. 'రాముడు వస్తాడో, రాడో?! తను ఇక్కడ ఉన్నదన్న సంగతి రాముడికి తెలుసో, మరి ఇంకా తెలియలేదో?! ఆ సంగతి రాముడికి చేరవేసే మార్గం కూడా ఏదీ చిక్కటం లేదు..'

రావణుడి దౌర్జన్యం కారణంగా అశోకవనంలోబందీ అయిన సీత మనసు పంజరంలో చిలకలాగా పరితపిస్తున్నది.

రావణుడు రోజూ ఉదయాన్నే అశోకవనానికి వస్తున్నాడు. తన గురించీ, తన పరాక్రమం

గురించీ చెప్తున్నాడు. తన బలం-బలగం ఎంత గొప్పవో వివరిస్తున్నాడు. 'ఎన్నాళ్ళు ఎదురుచూసినా రాముడు రాడు, రాలేడు' అని వికటంగా చెప్తున్నాడు. 'బెట్టు చాలించు- నా మాట విను' అని ఒత్తిడి చేస్తున్నాడు.



పంటి బిగువున ఈ రంపపుకోతని భరిస్తోంది సీత. 'ఈ లంకనుండి తప్పించుకునే మార్గం లేదు. వీళ్ళనందరినీ- ఈ రాక్షస బలాన్నంతటినీ ఎదిరించలేనని సీతకీ తెలుసు. తను ఒంటరిది- వీళ్ళు తనని ఏంచేసినా ఎదురాడలేదు-

"నువ్వేమీ చెయ్యలేవు! నాకు లొంగిపోవటం ఒక్కటే నీకు మార్గం! ఆలోచించుకో! ఇవాళ్ళ కాకపోతే రేపైనా నువ్వు నాదారికి రావల్సిందే!" గట్టిగా బెదిరిస్తూ చెబుతున్నాడు రావణుడు.

ఆ కారు చీకట్లో ఆశాకిరణం ఒక్కటి కూడా కనిపించట్లేదు. అయినా- గుండెల్లో దు:ఖం గూడు కట్టుకున్నా- 'తను ఒంటరిది' అనే ఆలోచనే వేధిస్తున్నా- సీత కోల్పోనిది ఒక్కటే- గుండె నిబ్బరం!

చెడునీ, దౌర్జన్యాన్నీ వ్యతిరేకించే స్పష్టమైన చూపు ఆమెకుంది. ఇవాళ్ళ కాకపోతే రేపైనా- 'మంచి' అన్నది ఏదో ఒకనాటికి- తప్పక బలం పుంజుకుంటుంది- ఈ దౌర్జన్యానికి జవాబు చెబుతుంది' అనే నిబ్బరం ఒక్కటే సీతను బ్రతికిస్తున్నది.

తను బయటపడే మార్గం లేదనీ, ఈ రావణ బలం ముందు తాను నిలబడలేదనీ తెల్సినా, సీత, రెండో ఆలోచనే లేకుండా రావణుణ్ణి బలంగా వ్యతిరేకిస్తూ వస్తున్నది. రావణుణ్ణి ఛీ కొట్టింది; అసహ్యించుకున్నది; తిట్టింది-

"నీకు బలం ఉండచ్చు; బలగమూ ఉండచ్చు. గతంలో నీకు, నీవాళ్లకి రాముడు చాలానే

నష్టం కలిగించి ఉండచ్చు- అయినా, నన్ను బంధించి, వేధించేసే ధోరణి మాత్రం అన్యాయమైంది. అన్యాయం ఎప్పుడూ గెలవదు. ఒక్కోసారి అది గెలిచినట్లు అనిపించినా, మరు క్షణంలోనే పతనం అయి తీరుతుంది. నీ దౌర్జన్యం ఏనాటికీ నా మనసు మార్చలేదు. నా నిబ్బరానికి తూట్లు పొడిచే శక్తి నీకు లేదుగాక లేదు- గుర్తుంచుకో.." అంటూ తన కొండంత మనోబలం ముందు రావణుడు గడ్డి పరక కన్నాహీనమని నిరూపించింది సీత.

తర్వాత నిజంగానే ఆమె నిబ్బరం గెలిచింది. రావణాసురుడు ఆమెను ఏమీ చెయ్యలేక పోయాడు. తనే అంతం అయ్యాడు!

నవ్వు!

**నిదానమే ప్రధానం!**

టీచర్: రేవంత్! ఇవాళ స్కూలికి ఆలస్యంగా వచ్చావేంటి?

రేవంత్: చాలా నెమ్మదిగా నడుచుకుంటూ వచ్చాను సార్.

టీచర్: నెమ్మదిగా నడవమని నీకెవరు చెప్పారు నాయనా?

రేవంత్: మరి స్కూల్ బయట కొత్తగా పెట్టిన బోర్డులో 'నిదానమే ప్రధానం' అని రాసారు సార్!

**ఓ!మై గాడ్!**

టీచర్:'మనం చనిపోయాం'బహువచనం, అయితే నేను చనిపోయాను, ఏమవుతుంది?

విద్యార్థి: స్కూలుకు సెలవు వస్తుందండి...!

**బలే శక్తి!**

తండ్రి: ఒరేయ్, మీ స్కూల్లో నీకు జ్ఞాపకశక్తికి బహుమతి ఇచ్చారటగా, ఏదీ చూపించు.

కొడుకు: ఎక్కడ పెట్టానో గుర్తుకు రావడం లేదు నాన్నా!



# అంతా మంచికే

*రచన: డా. సిరి, మిర్యాలగూడ, నల్గొండ జిల్లా.*

పూర్వం వారణాసిలో కృపాలుడనే నిరుపేద ఒకడు ఉండేవాడు. పసితనంలోనే తల్లిదండ్రులను పోగొట్టుకున్న అతడిని, అతడి బామ్మ పెంచిపెద్ద చేసింది.

ఒకసారి అతని బామ్మ తీవ్ర అనారోగ్యానికిగురైంది. అవసాన దశలో ఉన్న ఆమె కృపాలుడిని దగ్గరికి పిలిచి, "నాయనా, నేనుగానీ, నీ తల్లిదండ్రులుకానీ, నీకు గొప్ప ఆస్తులేవీ ఇవ్వలేకపోయాం. కానీ నువ్వు జీవితాంతం సంతోషంగా బ్రతికేందుకు మార్గాలు మాత్రం నీకు చెబుతాను: నిజాయితీ, గుండెధైర్యం, ఏది జరిగినా మన మంచికే అనుకోగల తత్వం- ఈ మూడింటినీ నీలో నిలుపుకో. ఏ పని చేసినా నిజాయితీతో చెయ్యి. ఎట్టి పరిస్థితుల్లోనూ నీ గుండె ధైర్యాన్ని చెదిరి పోనీకు. నీకు ఎదురయ్యేది మంచైనా-చెడైనా, అది నీ మంచికోసమేనని నమ్ము. ప్రతీ చెడులోనూ ఎంతోకొంత మంచి ఉంటుందన్న విషయాన్ని గ్రహించు!" అని చెప్పి కన్నుమూసింది.

బామ్మను కోల్పోయిన తర్వాత కృపాలుడు పనికోసం వారణాసిలో పేరుగాంచిన వర్తకుడైన భూపాలునివద్దకు వెళ్ళాడు. కృపాలుడిని పరీక్షించిన భూపాలుడు అతని పనితీరుకు, నిజాయితీకి మెచ్చి అతన్ని పనిలో చేర్చుకున్నాడు. కృపాలుడి జీవితం గాటిలో

పడ్డట్లయింది. అతను యజమాని తనకిచ్చిన పనిని నమ్మకంగా చేస్తూ మంచి పేరు తెచ్చుకోసాగాడు.

భూపాలుడి దగ్గర మయూఖుడు అనేవాడు కూడా పనిచేస్తూండేవాడు. అతను మొదట్లో కృపాలునితో స్నేహంగానే ఉండేవాడు; అయితే రాను రాను కృపాలుడి నిజాయితీనీ, మంచితనాన్నీ యజమాని పదేపదే అందరిముందూపొగడటం , తనమీదకంటే కృపాలునిమీదే ఎక్కువ అబిమానం చూపడం తట్టుకోలేకపోయాడు. కృపాలునిపట్ల తీవ్రమైన అసూయాద్వేషాలను పెంచుకొని, పైకి స్నేహం నటిస్తూనే, లోపలలోపల 'అతన్ని ఎలా దెబ్బతీయాలా?'అని యోచన చేస్తూ ఉండేవాడు.

అన్ని రోజులూ ఒక్కలాగా ఉండవు కదా, కొన్ని మాసాల తర్వాత, భూపాలుని ఒక్కగానొక్క కుమారుడు సుజనుడు ప్రాణాంతక వ్యాధితో మరణించాడు. కొడుకు మరణంతో కృంగిపోయిన భూపాలుడు ఇక ఆఊరిలో ఉండలేకపోయాడు. తన దగ్గర నిజాయితీగా పనిచేసి, తన సంపదను- గౌరవాన్నీ పదింతలు చేసిన కృపాలుడికి తన భవనాన్నీ, కొంత సంపదను ఇచ్చాడు. మయూఖుడికి కూడా ఏదైనా వ్యాపారం చేసుకొమ్మని కొంత బంగారాన్ని ఇచ్చి, అక్కడినుండి వెళ్ళిపోయాడు.



అంత సంపద, అంతపెద్ద భవనం లభించినందుకు కృపాలుడిని అందరూ పొగిడారు - 'బలే అదృష్టవంతుడు' అన్నారు. అయితే కృపాలుడు మాత్రం మురిసిపోలేదు; మారిన తన స్థాయిని చూసి గర్వపడలేదు- ఎప్పటిలాగే నిజాయితీగా పనిచేయసాగాడు. తనని మెచ్చుకునేవారినిచూసి నవ్వి

ఊరుకునేవాడు.

అటు మయూఖుడు, యజమాని భవనాన్ని తనకి ఇవ్వకుండా కృపాలుడి పరం చేసినందుకు నొచ్చుకున్నాడు. అయితే యజమాని తనకిచ్చివెళ్ళిన బంగారంతో వ్యాపారం చేసి, అతను కూడా త్వరలోనే గొప్ప లాభాలనుగడించాడు- పెద్ద ధనవంతుడైపోయాడు.

అంతలోనే కృపాలుడికి ఎదురు దెబ్బ తగిలింది. కృపాలుడి భార్యకు తీవ్రమైన జబ్బు చేసింది. ఆమె వైద్యం నిమిత్తం కృపాలుని వద్దనున్న సంపదంతా హరించుకుపోవటమే కాక, మరింత ధనంఅవసరమైంది.

మొదటినుండీ మయూఖుడిని స్నేహితుడిగా భావించిన కృపాలుడు, అప్పుకోసం అతని దగ్గరకెళ్లాడు. అదే అదనుగా భావించిన మయూఖుడు - 'యజమాని ఇచ్చిన భవనాన్ని తనకు అమ్మితేనే ధనమిస్తాను; లేకపోతే లేదు'అని ఖరాఖండిగా చెప్పాడు. చేసేదిలేక కృపాలుడు, యజమాని తనకెంతో అభిమానంతో ఇచ్చిన ఆ భవనాన్ని మయూఖుడికి అమ్మేశాడు. తాననుకున్నది సాధించిన మయూఖుడు గర్వంతో పొంగిపోయాడు.



కృపాలుడిభార్యమాత్రం దీనంతటికీ తానే కారణమని ఎంతో బాధపడింది. కృపాలుడుమటుకు-" 'ఏది జరిగినా అంతా మన మంచికే' అని నేను మనస్ఫూర్తిగా నమ్ముతున్నాను; నువ్వుకూడా నమ్ము. 'ఏదో మంచికోసమే మనకిలాజరిగింది'అనుకో. ఊరికే బాధపడకు!" అని భార్యతో చెప్పాడు. ఆరోజే వైద్యంకోసమని పట్నం బయలుదేరారిద్దరూ. దారిలో వాళ్ళిద్దరూ ఒక భయంకరమైన

వానలో చిక్కుకున్నారు . వర్షం విరుచుకుపడుతుండటంతో, దగ్గరలోనే కనిపించిన ఓ పాడుబడ్డ కోటలో తలదాచుకున్నారు. కృపాలుడి అవస్థను చూసి, అతని భార్య ఎంతగానో దు:ఖించింది: "అంత గొప్ప భవనంలో ఉండాల్సిన మీరు, అన్నీ కోల్పోయి ఇలా పాడుబడ్డ కోటలో తలదాచుకోవాల్సిన అగత్యం ఏర్పడిందే- ఇదంతా నావల్లనేగా?" అని కంటతడిపెట్టింది.

అప్పుడు కూడా కృపాలుడు బామ్మచెప్పిన మాటనేగుర్తుచేశాడు:

"ఇదికూడా మనమంచికే అనుకో! ధైర్యాన్ని కోల్పోకు. ధైర్యం మనతో ఉన్నంతవరకూ, మనకు అన్ని ఆస్తులూ ఉన్నట్లే" అని చెప్పాడు ప్రేమగా.

చూస్తూండగానే వర్షం తీవ్రరూపం దాల్చి, తుఫానుగా మారింది. ఆ తుఫాను ధాటికి అడవిలోని మహావృక్షాలు సైతం కూకటి వ్రేళ్లతో పెకలించుకు పోయాయి. కృపాలుడు, అతని భార్య తలదాచుకున్న కోటకూడా సగం కూలిపోయింది. అదృష్టం కొద్దీ కోటగోడ రాళ్ళు వాళ్ళ మీద పడలేదు. తెల్లవారి, వర్షం తగ్గాక, బయటికి వెళ్ళేందుకు అడ్డం పడిన రాళ్లను తొలగిస్తున్న కృపాలుడికి ఆ రాళ్లలో ఏదో వెలుగు కనిపించింది. 'ఏమిటా' అని చూస్తే అక్కడ కోటగోడలో వెలలేని బంగారు ఇటుకలు, వజ్రాల హారాలు ఉన్నాయి!



వాటిని చూసి కృపాలుడి భార్య ఎంతగానో సంతోషించింది. మళ్ళీ తమ భవనాన్ని తాము కొనుక్కోవచ్చని సంబరపడింది. ఆ సంతోషంలో ఆమె ఆరోగ్యం కూడా బాగైంది! బంగారు ఇటుకలతో, వజ్రాలహారాలతో ఊరికి తిరిగివెళ్లిన కృపాలుడికి, అక్కడ తుఫాను ధాటికి నేలమట్టమైన తమ భవనం

కనిపించింది!

ఆనాడు అందులో ఉండి ఉంటే తాము ప్రాణాలతో మిగిలేవాళ్ళు కారు!

అటు తర్వాత కృపాలుడి భార్య "అంతా మన మంచికే" అని పూర్తిగా విశ్వసించింది.

మంచి పద్యం!

విద్య నిగూఢ గుప్తమగు విత్తము; రూపము పూరుషాళికిన్
విద్య యశస్సు, భోగకరి, విద్య గురుండు, విదేశ బంధుడున్
విద్య విశిష్ట దైవతము, విద్యకు సాటి ధనంబు లేదిలన్
విద్య నృపాల పూజితము, విద్యనెరుంగనివాడు మర్త్యుడే?!

చదువును మెచ్చుకుంటూ ఏనుగు లక్ష్మణ కవి రాసిన ఈ పద్యం 'సుభాషిత రత్నావళి' లోది. "విద్య రహస్యంగా దాచిపెట్టుకున్న డబ్బులాంటిది. మనుషులకు విద్యే అందం. విద్య వల్లనే కీర్తి-ప్రతిష్ఠలు కలుగుతాయి. అన్ని సుఖాలనూ అందజేసేది విద్యే. విద్య గురువులాగా వివేకాన్నిస్తుంది. విదేశాలలో మనకు చుట్టం విద్యే. విద్య అన్నిటికంటే గొప్ప దైవం. విద్యకు సాటివచ్చే సంపద ఈ లోకంలో మరేదీ లేదు. రాజాధిరాజుల చేత కూడా పూజింపబడుతుంది విద్య. అంత గొప్పదైన విద్యను నేర్చుకోనివాడు అసలు మనిషేనా? కాదు" అంటున్నది ఈ పద్యం.

భర్తృహరి అనే గొప్ప సంస్కృత కవి మూడు వందల మంచి సూక్తులతో "సుభాషిత త్రిశతి" అనే పుస్తకం రాశాడు. ఏనుగు లక్ష్మణకవి దాన్ని మొత్తాన్నీ భావం ఏమాత్రం చెడకుండా, చక్కని తెలుగు పద్యాలుగా మలచాడు. వీటిలో ఒక్కో పద్యం ఒక్కో ఆణిముత్యం!



# దొంగని పట్టుకున్న వైనం

*అనువాద రచన: శ్రీ పి.వి.ప్రసాద్, విజయవాడ*
*"హిందూ" దినపత్రిక (24-4-2012) లో ప్రచురితమైన 'టు కాచ్ ఎ తీఫ్' అనే కథ స్ఫూర్తితో..*

అది ఒక రహదారి. దాని పక్కనే ఓ బాటసారుల హోటల్. రాత్రి సమయం కావడంతో బాగా రద్దీగా ఉంది. చాలా మంది ప్రయాణికులు విశ్రాంతి కోసం అక్కడ ఆగి ఉన్నారు. కొంతమంది పొయ్యి దగ్గర కూర్చుని చలి కాగుతూ సేద దీర్చుకుంటుంటే, మరి కొంతమంది నిద్రకు ఉపక్రమించారు.

ఆ సమయంలో అకస్మాత్తుగా ఓ ప్రయాణికుడు లేచి " నా సంచిలోని డబ్బు పోయింది.." అని తోటివారిని అందరినీ కంగారు పెడుతున్నాడు.

అంతవరకూ ప్రశాంతంగా ఉన్న హోటల్లో క్షణాల్లో గందరగోళం చెలరేగింది. పక్కగదిలోంచి లేచి వచ్చిన ఓ ముసలాయన "ఏమైందీ? ఏంటీ, ఈ గోల?" అంటూ ఆరా తీసాడు.

"అతని డబ్బుని ఎవరో దొంగిలించారట!" అక్కడున్న వాళ్ళు వివరించారు.

అది విన్న ఆ వృద్ధుడు అందరివంకా ఓ సారి తేరిపార చూసాడు. కొంచెంసేపు ఆలోచించి "దొంగని పట్టుకునే ఉపాయం నేను

చెబుతాను. అయితే ముందుగా నాకు ఓ కోడిపుంజు కావాలి..." అని అడిగాడు.

వెంటనే అక్కడున్నవాళ్ళు అటూ ఇటూ వెతుకులాడారు. ఎట్టకేలకు ఓ గంప కింద వున్న కోడిపుంజుని తెచ్చియిచ్చారు.



"అలాగే ఆ పొయ్యి దగ్గరున్న కుండను కూడా నా దగ్గరకు తెండి" అడిగాడు ముసలాయన. ఎవరో దాన్ని కూడా తెచ్చి యిచ్చారు.

అక్కడున్నవాళ్లంతా ముసలాయన చుట్టూ మూగారు. ఆయన అందరినీ నిశితంగా పరిశీలిస్తూ అన్నాడు- "జాగ్రత్తగా వినండి! నేనిప్పుడు కోడిపుంజుపైన ఈ కుండను బోర్లించి, ఓ మంత్రం జపిస్తాను. తరవాత ఇక్కడున్న లైట్లన్నీ ఆర్పివేయబడతాయి. ఆ చీకట్లో మీరంతా ఒక్కరొక్కరుగా రావాలి. వచ్చి, ఈ కుండపైన మీ రెండు చేతులతోటీ రుద్దాలి. దొంగతనం చేసినవాడు ఈ కుండను రుద్దగానే మరుక్షణం కుండ కింద ఉన్న కోడి కూస్తుంది. దొంగ దొరికిపోతాడు!" అని.

అందరూ ఆశ్చర్యపోయారు. కోడిపుంజుకి అంత శక్తి ఉంటుందంటే కొందరు నమ్మలేకపోయారు. ఏమవుతుందో చూద్దామని కొందరు అనుకున్నారు. మొత్తంమీద అందరూ 'సరే'నని తలాడించారు.

ముసలాయన కోడిపుంజుపైన కుండని బోర్లించాడు. లైట్లని ఆర్పేయమన్నాడు. చివరకు పొయ్యిలో వెలుగుతున్న నిప్పుని కూడా ఆర్పేయించాడు. ఆ రోజు అమావాస్యకూడా అయిఉంటుంది; అంతటా చీకటి అలముకొంది. ఆ చీకట్లోనే, ఒక్కొక్కరూ తడుముకుంటూ వచ్చి, ముసలాయన చెప్పినట్లుగా కుండని చేతులతో రుద్దసాగారు.

కోడి మాత్రం కూయలేదు!

కొంతసేపటికి ముసలాయన అడిగాడు- "ఏదీ, ఇంకా అవ్వలేదా? అంతా నేను చెప్పినట్లుగా చేసారా, లేక ఇంకా ఎవరైనా మిగిలి వున్నారా?!" అని.



అందరూ కుండని రుద్దినవాళ్ళే! దాంతో ఆయన ఆశ్చర్యం వెలిబుచ్చుతూ "అయితే నాదే పొరపాటు.. ఇక లైట్లన్నీ వేయండి. కాండిల్స్ కూడా వెలిగించండి!" అన్నాడు.

లైట్లు వెలిగాయి. అక్కడ ఉన్న వాళ్లందరినీ వచ్చి తన చుట్టూ నిలబడమన్నాడు ముసలాయన.

"ఏవీ? మీ చేతులొకసారి చూపించండి..." అంటూ ముసలివాడు అందరి చేతులూ పరిశీలించాడు- కానీ అందరి చేతులూ నల్లబడే ఉన్నాయి! ముసలాయన ముఖం లో విచారం. ఆయన గొంతు సవరించుకొని ఇంకా ఏదో అనబోతున్నాడు- అంతలోనే అక్కడ ఉన్న రాము లేచి నిలబడి అరిచాడు: "నేను ఈ సంగతి ముందే ఊహించాను- తాతా, తెలివిగా తప్పించుకుందామని, పైపెచ్చు కోడిని కూడా కొట్టేద్దామని చూశావు కదూ, నేను అంతా చూస్తూనే ఉన్నాను. మర్యాదగా నువ్వు తీసిన డబ్బుని అక్కడ పెట్టేస్తావా, లేకపోతే సోదా చేయించమంటావా?!" అని.

దాంతో ముసలాయన ముఖం నల్లబడింది.

చుట్టూ ఉన్నవాళ్ళు సోదా జరిపితే పోయిన డబ్బు ముసలివాడి దగ్గరే దొరికింది!

అందరూ రాముని అభినందించారు. డబ్బు దొరికిన మామయ్య అయితే రాముకి బహుమతిగా పది రూపాయలు ఇచ్చాడు!

రాము వాళ్ళ అమ్మ వాడికేసి మురిపెంగా చూస్తూ- "నిజంగానే నువ్వు తాత దొంగతనం

చేయటం చూశావారా, నీకు అంత గమనించే శక్తి ఉందని నేనెప్పుడూ అనుకోలేదే, ఎప్పుడూ ఏదో కథల లోకంలో ఉంటావుగా?!" అన్నది.

"లేదమ్మా, దొంగను పట్టుకునే ఈ కథ అసలు పిల్లలందరం ముందు ఏనాడో చదివిందే కదా! చేతికి మసి అంటకపోవటం చూసిన మర్యాద రామన్న ఏనాడో పట్టుకోలేదూ, దొంగని?! 'అంత పాత ట్రిక్కును మళ్ళీ ఈయన ఎందుకు ప్లే చేస్తున్నాడు?' అని జాగ్రత్తగా చూశాను; చూస్తే మరి అందరి చేతులకూ మసి అంటుకునే ఉంది; మసి అంటని చేతులు ఆ తాతవే! అట్లా నాకు మళ్ళీ అనుమానం వచ్చింది. అయినా అనుమానం తీర్చుకునే దారి దొరకలేదు. ఏం చెయ్యాలి?

దొంగను పట్టుకునేందుకు "నేను అంతా చూశాను.." అని ఊరికే బుకాయించానంతే! నిజం దొంగను పట్టుకోవాలంటే బుకాయింపే మార్గం మరి!" అన్నాడు రాము నవ్వుతూ.

కవిత!

## ప్రకృతి

ఆస్వాదించండి ఈ ప్రకృతి సౌందర్యం
ఇది అందరికీ ఓ ఆనంద వరం
వికసించి విరబూసే రంగురంగుల పుష్పాలు
ఆలపిస్తూ, ఆకృతినిచ్చే అందమైన నదులు
ఆనంద గీతికతో, సు-వర్ణ గతితో పరవశింపజేసే పక్షుల గానాలు
ప్రకృతినే మురిపించే పచ్చని పంటలు
మన పల్లెల సౌందర్యం, మదిలో ఓ ఆనందం
ప్రకృతికి ఇదే నా నమస్కారం! నత మస్తకం!

*పి.మౌనిక, 8 లిలీ, అరవింద స్కూల్, కుంచనపల్లి, గుంటూరు జిల్లా.*

# పాపం

*కొన్ని కొన్ని నమ్మకాలకు అర్థం ఉండదు. అట్లాంటి అర్థం లేని నమ్మకాలను తిరస్కరించటమే మేలు. ఇదిగో, ఈ కథ చదవండి-మీరు ఏమనుకునేదీ చెప్పండి..*

*సౌజన్యం: "మామ్మ కథలు" రచన: వియోగి* *చిత్రం: శ్రీ ఎవియం*

"పిల్లలు లేని ఇల్లు పిశాచాల ఇంటితో సమానం. ఆ యింట్లోవి ఏవీ తినకూడదు, తాగకూడదు. అసలు వాళ్ళ ఇంటికే వెళ్లకూడదు" ముఖం చిట్లిస్తూ చెప్పారు గురువుగారు, గురునాధం.

"అంటే పిల్లలు పుట్టని దంపతులు పిశాచాలా?" అడిగాడు శిష్యుడు అభిరాముడు ఆశ్చర్యంగా.

"మరి?! ఎంత పాపం చేసుకుంటే అట్లా అవుతుంది! 'పిల్లలు పుట్టలేదు' అంటే 'మహా పాపి' అని అర్థం" చెప్పారు గురువుగారు.

అప్పటి నుంచి ఆ ఇంటికి భిక్షకు వెళ్లటం మానివేశాడు అభిరాముడు. ఆ సందులోకి వెళ్ళినా, ఆ ఇంటికి ఇరువైపులా ఉన్న ఇళ్ళలో అడుక్కునేవాడు కాని, ఆ ఇంట్లో మటుకు అడిగేవాడు కాదు.



కొన్నాళ్లకు ఆ ఇంటి ఇల్లాలు అనసూయ ఈ సంగతిని గుర్తించింది. ఒకసారి పక్కింటిముందు నిలబడి భిక్షాం దేహీ' అని అభిరాముడు అరవగానేఅనసూయమ్మ తన పళ్ళెంలో ఆహారం తీసుకొని బయటికి వచ్చింది. 'ఇదిగో భిక్ష- తీసుకోండి' అంది.

'వద్దు-వద్దు. నేను మిమ్మల్ని అడగలేదు' అన్నాడు అభిరాముడు.

'అడక్కపోయినా ఇస్తున్నాననుకో- నేను ఇచ్చేదాన్ని, నువ్వు పుచ్చుకునేవాడివి' అంది అనసూయమ్మ, కావాలని.

'కాదులెండి, ఇంకెవరికన్నా ఇవ్వండి' అన్నాడు అభిరాముడు నీళ్లు నములుతూ.

'ఏం, మీ భిక్షాపాత్రేమీ నిండుగా లేదుగా?" అడిగింది అనసూయమ్మ ఖాళీ పాత్ర కేసి చూస్తూ.

'అయినా మీరిచ్చే భిక్ష తీసుకోవద్దన్నారు మా గురువుగారు' అన్నాడు అభిరాముడు, ఇంక తప్పదన్నట్లు.

'అదేం, పాపం?' ఆశ్చర్యంగా అడిగింది అనసూయమ్మ.

'పిల్లా పాపలు లేని ఇంట్లో ఏమీ స్వీకరించకూడదు. వాళ్ళు మహా పాపులని శాస్త్రం చెబుతున్నది' చెప్పేశాడు అభిరాముడు, నిబ్బరంగా.

'ఓహో! సరే స్వామీ!మేమంటే పాపం చేశాం కాబట్టి పిల్లాపాపలు కలగలేదు; మరి మీరు ఏం పాపం చేసుకున్నారని, ఇట్లా వీధి వీధినా అడుక్కుంటున్నారు? ఉండటానికో ఇల్లు లేదు; తినటానికి తిండి లేదు; నాన్నా అని పిలిచే పిల్లలు లేరు- అంటే మాకంటే ఘోర పాపం చేసుకున్నట్లే కదా. అట్లాంటి పాపులకు భిక్షపెట్టి మేము ఎంత పాపులం అవుతున్నామో మరి!' అడిగేసింది అనసూయమ్మ గట్టిగా.

అభిరాముడికి జ్ఞానోదయం అయ్యింది. వెంటనే లెంపలు వేసుకొని భిక్ష స్వీకరించాడు.

**అడగటం మంచిది!**

నవ్వు!

బంటి: ఎవరికైనా పరీక్షల్లో 35 మార్కులు వస్తే 'పాస్' అని మీరే చెప్పారు సార్! కానీ నాకు 36 మార్కులు వచ్చినా ఫెయిల్ చేసారెందుకు?!

టీచర్: ప్రతి సబ్జెక్టులోనూ 35 రావాలి బంటీ, కానీ నీకు అన్ని సబ్జెక్టుల్లోను కలిపి 36 వచ్చాయి! నేనేం చేసేది చెప్పు?!

# పదరంగం-67

నిర్వహణ: కొత్తపల్లి

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | 2 | | | 3 | 4 |
| | | | | 5 | |
| 6 | | 7 | 8 | | |
| | | 9 | | | 10 |
| 11 | 12 | | | 13 | |
| 14 | | | | 15 | |

## అడ్డం

1. తొలిసంజ వెలుగు! (3)
3. తిరగబడ్డ స్వప్నం (2)
5. తల్లి (2)
6. ఊరికే, ఏం చేయాలో తోచక! (5)
9. వాసనల్ని మోసుకొచ్చేది! (2)
10. సంబోధన ప్రథమా విభక్తిలో మొదటిది (1)
11. వయసులో పెద్దాయన (5)
14. పూచేవి తిరగబడ్డాయి (2)
15. రోకలితో బరువుగా పడే దెబ్బ! (2)

## నిలువు

2. వెలకట్టే వడ్డీ వ్యాపారి! (3)
3. గందరగోళమైన 'కోపం-ఏడుపు-బాధ' (3)
4. చెవికి పెట్టుకునే ఆభరణం (2)
6. వానకు ముందొచ్చే పెద్ద శబ్దాలు! (4)
7. ఒక సంచార జాతి- 'మంచి గాలి' (3)
8. ఎంత గజిబిజైనా, ఇది 'పోవాలి' ! (3)

12 దండలో భాగం, వెన్న తర్వాతా వస్తుంటుంది! (2)

13 అడవుల్ని కాల్చి చేసే వ్యవసాయం, తిరగబడ్డది! (2)

అడ్డం-నిలువు ఆధారాల సహాయంతో ఈ గడులను నింపగలరేమో చూడండి. నింపిన పదరంగాన్ని, కేవలం పోస్టుకార్డుపై రాసి, మాకు అందేట్లు పంపండి. మీ బడి పేరు, తరగతి, మీవాళ్ల ఫోను నంబరు తప్పక రాయండి. సరైన సమాధానం రాసి ఎంపికైన ముగ్గురు పిల్లలకు కొత్తపల్లి-69 ని బహుమతిగా పంపిస్తాం!

కొత్తపల్లి ప్రచురణలు, 1-127/A, యంఆర్వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా-515101

# పదాల్ని వెతికి పట్టుకోండి!

**మనసు, మంచివాడు, వేటగాడు, కోతి, కోవెల, కరము, వనమాలి, చినుకు, చిగురాకు, పుణ్యము, పాపము, కోయిల, పులి, ఆమని, వెన్నెల, గిన్నె, అడవి, వాకిలి, వరము, చీకటి**

పై పదాలు ఈ క్రింది పట్టికలో దాగున్నాయి- నిలువుగా, అడ్డంగా, వాలుగా, క్రిందినుండి పైకి- ఎటుపడితే అటు! వాటిని వెతికి పట్టుకోండి. వాటి చుట్టూ గుండ్రాలు గీయండి!

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఆ | వి | గి | ని | మ | ఆ | తి | గా | చీ | కో | ణ్య | న్నె |
| డ | తి | అ | ణ్య | వా | మ | లు | క | చి | ను | గి | వె |
| ణ్య | డ | కో | సు | యి | వే | టి | ను | కు | పా | చి | అ |
| పా | అ | న్నె | న | కో | యి | కు | వ | ర | యి | ము | డు |
| ది | వా | లి | మ | మా | వె | ల | ము | ణ్య | పు | వా | లి |
| ఆ | కి | చి | గు | న | న్నె | ల | ప | డ | చి | ణ్య | ము |
| చి | లి | మా | న | వ | యి | య | పా | మం | క | టి | ర |
| పు | గు | ఆ | వా | కో | సీ | ల | పా | చీ | ప | పా | వ |
| కు | ణ్య | కు | వే | కి | ణ్య | పు | క | ర | ము | ణ్య | కో |
| వి | పు | రా | లి | ట | ము | ప | యి | ణ్య | ని | వ | యి |
| డ | పు | గు | మ | వి | గా | గి | ల | న్నె | వె | ర | ల |
| అ | ని | చి | కు | ని | అ | డ | మా | డ | అ | టి | క |

# నవ్వండి!

*నిర్వహణ: శ్రీవివియస్ మూర్తి, చొదిమెళ్ళ, ప.గో.జిల్లా*

**మైకు!**

ఇంగ్లీషు టీచరు: "సౌండ్ స్లీప్" అంటే ఏంటిరా, రాముా?

రాము: మరేనండి, మా నాన్నారి లాగా 'గురకపెడుతూ నిద్రపోవటం' అండి!

**మతి మెరుపు!**

పేషంటు: ఏమిటో డాక్టరుగారూ, కొన్ని సంగతులు గుర్తుంటాయి, కొన్ని గుర్తుండవు నాకు!

డాక్టరు: ఏవి గుర్తుంటాయి, చెప్పండి!

పేషంటు: నేను ఎవరికైనా అప్పులు ఇస్తే అవి గుర్తుంటున్నాయండి.

డాక్టరు: భేష్! మరింకానేం! సరే, మరి గుర్తుండనివేమిటి?

పేషంటు: నేను తీసుకున్న అప్పులు సార్!

**జై జై నాయకా!**

తల్లి: (పిల్లాడిని చూసుకొని మురిసిపోతూ) వీడు తప్పక రాజకీయనాయకుడు అవుతాడండి! తండ్రి: నీకెలా తెలుసు?

తల్లి: మీరు కథ చెప్తున్నపుడు "ఊ" కొట్టకుండా "జై" కొడుతున్నాడు, విన్నారా?

**తెలుగా, ఇంగ్లీషా?**

ఉద్యోగి: సార్ మీరు జీతాలిచ్చేప్పుడు ఇంగ్లీషు నెలల్ని కాకుండా తెలుగు నెలల్ని అనుసరిస్తే బాగుంటుందండి!

ఆఫీసరు: అదేమి?

ఉద్యోగి: తెలుగు నెలల్లో అయితే అధికమాసాలూ అవీ వస్తుంటాయి కదండీ! ఉత్సాహంగా ఉంటుంది మాకు!

**చాలా అవసరం!**

పేషంట్: డాక్టరుగారూ, నాకిప్పుడు ఆపరేషన్ అవసరమంటారా..?

డాక్టరమ్మ: అవసరం లేకపోతే మేమెందుకు చేస్తామమ్మా..మాకూతురికి నెక్లెస్ చేయిస్తానని మాటిచ్చాను మరి!

**ఫేస్ బుక్**

హెడ్మాస్టర్: మీ అబ్బాయి ఇంట్లో సరిగ్గా చదువుకుంటున్నాడా?

పేరెంట్: రోజూ చదువుకుంటాడండీ, చెప్పక్కర్లేదు వాడికి..

హెడ్ మాస్టర్: ఏం చదువుతాడు వాడు?

పేరెంట్: అదేదో, ఫేస్ బుక్ అట కదండీ, ఎప్పుడడిగినా, ఆ బుక్కే చదువుతున్నానంటాడు..

**చికెన్ కాదు, కోడి!**

భార్య: ఏంటండీ, డాక్టరుగారు చికెన్ తినొద్దన్నారు కదా?

భర్త: అయ్యో! నీకు ఇంగ్లీషు అస్సలు దాదేమే? చికెన్ అంటే కోడిపిల్ల. ఇది చికెన్ కాదు - కోడి!

**స్లిప్ టెస్ట్**

వెంగళప్ప: అదేంట్రా, పరీక్షటైమింకా అవ్వనేలేదు, అప్పుడే వచ్చేశావు..

వెంగళప్ప కొడుకు: ఏమో నాన్నా! 'స్లిప్ టెస్ట్' అన్నారు కదా అని నాలుగు స్లిప్ లు తీసుకెళ్ళాను; వెనక్కు తిప్పి పంపేశారు!

వెంగళప్ప: పిచ్చోడా! 'స్లిప్ టెస్ట్' అన్నారు గానీ 'స్లిప్స్ టెస్ట్' అనలేదుగా?! ఒక్క స్లిప్ తీసుకెళ్ళి ఉంటే రాయనిచ్చేవాళ్ళు!

# ప్రశ్నల్లో జవాబులు!

*ఈ ప్రశ్నల్లోనే జవాబులు దాక్కొని ఉన్నాయి - చూడండి! మీరూ ఇలాంటివి చాలా తయారు చేయచ్చు! ప్రయత్నించండి!*
*సేకరణ: రిషివ్యాలీ స్కూల్ తెలుగు విద్యార్థులు, మదనపల్లి.*

**టీ!**

ఉదయాన్నే లేచి తాగేదేమిటీ?

**చెప్పు!**

పాదరక్షకు మరో పేరు చెప్పు.

**సా!**

'రంపాన్ని' ఇంగ్లీష్‌లో ఏమంటారో తెలుసా?

**రాయి!**

'స్టోన్' ని తెలుగులో ఏమంటారో రాయి.

**అడుగు!**

'ఫుట్' కి తెలుగు ఏమిటో నీ స్నేహితుడిని అడుగు.

**అమ్మా!**

'మాత' అంటే ఏమిటో చెప్పమ్మా!

**వా!**

'రా' ని తమిళంలో ఏమంటారో చెప్పగలవా?

**తెలుపు!**

ధవళ వర్ణం అంటే ఏ రంగో తెలుపు

**రా!**

'కమ్' అంటే ఏమిటో చెప్పరా!

**వెతుకు!**

'సెర్చ్' అనే పదానికి అర్థం ఏమిటో డిక్షనరీలో వెతుకు.

# వాకర్ థాంప్సన్

యువకెరటాలు

*నిర్వహణ: సౌమ్య, పుస్తకం డాట్ నెట్*



యూరోపియన్ కమిషన్ వారు యూరోపియన్ యూనియన్లో భాగస్వాములైన దేశాల్లోని (మన దేశంలోని వాళ్లకి కాదు!) పదహారేళ్ళ వయసు పిల్లలకి 'Juvenes Translatores'- "యువ అనువాదకులు" అని ఓ పోటీ నిర్వహిస్తారు. 2007 నుండి ఈ పోటీ ఏటేటా జరుగుతూ వస్తోంది.

ప్రతి ఏడాదీ వీళ్ళు ప్రకటన విడుదల చేశాక, ఈ దేశాల్లోని స్కూళ్ళు తమ తరపున ఓ నలుగురైదురు పిల్లల్ని ఎంపిక చేయొచ్చు పోటీకి. అట్లా వచ్చిన స్పందనల్ని చూసుకొని యూరోపియన్ యూనియన్ వాళ్ళు ముందుగా కొన్ని స్కూళ్ళని ఎంపిక చేసుకొని అందరికీ తెలియపరుస్తారు. అప్పుడు ఈ పిల్లలు అందరూ ఒక అనువాద పరీక్ష కి వెళ్ళి, అక్కడ ఇచ్చిన అంశాన్ని అనువాదం చేయాల్సి ఉంటుంది. ఆ పరీక్ష అయ్యాక, వాళ్ళు ఒక్కో దేశానికి ఒక్కో విద్యార్థి చొప్పున ఎంపిక చేసి, అందరినీ పిలిచి, ఒక సభలో బహుమతి ప్రదానం చేస్తారు అన్నమాట. ఈ ఏడాది బ్రిటన్ దేశానికి చెందిన వాకర్ థాంసన్ అనే అబ్బాయి ఈ అవార్డుకి ఎంపికయ్యాడు. అతన్ని గురించి వార్తల్లో చదివాను. ఈసారి అతన్ని గురించి పరిచయం చేస్తున్నాను.

ఈ అబ్బాయికి చిన్నప్పటినుంచీ 'రకరకాల భాషలు నేర్చుకోవటం' అంటే ఇష్టమట! ఇప్పటికే ఇతనికి ఫ్రెంచి, జర్మన్, గ్రీకు, ఇటాలియన్, పోర్చుగీస్, రష్యన్, స్పానిష్, సంస్కృతం, ప్రాచీన గ్రీకు, లాటిన్ భాషల గురించి, పూర్తి స్థాయిలో కాకపోయినా, ఎంతోకొంత అవగాహన- ఉందట! "ప్రస్తుతం అరబిక్ భాషని నేర్చుకోడానికి ప్రయత్నిస్తున్నాను" అని చెప్పాడు అతను, ఒక వెబ్సైటుకి

ఇచ్చిన ఇంటర్వ్యూలో! అవార్డు వచ్చిన సందర్భంగా వాకర్ తన రష్యన్ ఉపాధ్యాయుడికీ, తోటి విద్యార్థులకీ ధన్యవాదాలు తెలిపాడు. "ఆయా భాషలని నిజ జీవితంలో ఉపయోగించటంతో పాటు, ఆ భాషల వెనక ఉన్న శాస్త్రీయ అంశాలని భాషాశాస్త్ర పరంగా తెలుసుకోవడం అంటే కూడా నా కెంతో ఇష్టం" అని చెప్పాడు థాంప్సన్. భవిష్యత్తులో తనకున్న ఈ బహుభాషా పరిజ్ఞానాన్ని వాడుకోగలిగే ఉద్యోగం ఏదన్నా చేయాలని అతని కోరికట! -అంటే, వేరు వేరు భాషలు మాట్లాడే దేశాలమధ్య వచ్చే తగవులు తీర్చటం, పెద్ద పెద్ద బహుదేశీయ ప్రాజెక్టులలో- వివిధ దేశాల వాడకందారులతో సంప్రదింపులు జరపడం - ఇలాంటివన్నమాట.

"మనంకూడా చిన్నప్పటి నుండీ రెండు మూడు భాషల్లో చదవటం, రాయటం నేర్చుకుంటూ పెరుగుతాం గదా?! ఒక భాషలో వచ్చే అంశాలను మరో భాషలోకి అనువాదం చేస్తూంటే..? అట్లా మన భాషా పరిజ్ఞానం మెరుగుపడుతుందిగదా!"అనిపించింది నాకు, వాకర్ థాంప్సన్ గురించి చదువుతుంటే. ఈ వ్యాసం రాయడానికి అదీ ఒక కారణం.

మరి మీలో ఎవరైనా మీకు నచ్చిన ఒక చందమామ కథనో, కొత్తపల్లి కథనో ఆంగ్లంలోకి అనువదించడానికి ప్రయత్నిస్తారా? లేదంటే, మీరు చదివిన ఆంగ్ల కథని దేన్నైనా తెలుగులోకి అనువదించండి- కొత్తపల్లి బృందానికి నచ్చితే దాన్ని ప్రచురిస్తారు కూడాను! వీటిల్లో ఏది చేసినా మన భాషా పరిజ్ఞానం మెరుగు పడుతుంది కదా, ఏమంటారు?

మీకు ఈ పుస్తకం నచ్చిందా? మరైతే దీన్ని వృధా పోనివ్వకండి. మీదగ్గరున్న పుస్తకాలను మీ స్నేహితులతో తప్పకుండా పంచుకోండి. 'పుస్తకాలు పంచుకోవటం' బలే బాగుంటుంది! దానివల్ల అందరికీ లాభమే మరి!

మంచి పుస్తకం:

## మామ్మ కథలు

*రచన: వియోగి*







"బాలలకథలు రాయాలంటే భాష మీద పట్టు ఉండాలి. పిల్లలతో పరిచయం ఉండాలి. విషయాన్ని ఎంత సులభంగా, సూ టిగా చెబితే వాళ్ళకు అర్థం అవుతుందో తెలిసి ఉండాలి. పైగా తాము చెప్పే ఆ కథ పిల్లలకు ఏ రకంగా పనికివస్తుందో రచయితకు తెలియాలి...బాలల కథలలో వారి హృదయానికి తాకేట్లు మంచి నీతి ఉండాలి..." - నిజంగానే ఇవన్నీ తెలిసిన రచయిత కర్నూలు జిల్లాకు చెందిన వియోగిగారు, పిల్లలు చక్కగా చదువుకునేందుకువీలుగా రాసిన కథల పుస్తకం, ఈ "మామ్మ కథలు". ఏవియంగారు కథ కథకూ వేసిన బొమ్మలు బాగున్నాయి. ఆరు-ఎనిమిది తరగతుల పిల్లలు చదవి ఇష్టపడే పుస్తకం ఇది!

"మామ్మ కథలు" శ్రీ కృష్ణా పబ్లికేషన్సు, కర్నూలు ఫోను: 9502629095 పేజీలు 128, వెల 100 రూ.


**కృతజ్ఞతలు:** ఈ సంచిక వెలువడటంకోసం ఇరవై ఐదు వేలరూపాయలు విరాళంగా ఇచ్చిన దాతశ్రీ బాల్‌రెడ్డిగారికి ప్రత్యేక కృతజ్ఞతలు. పత్రికను నడిపించటంకోసం అమూల్యమయిన సలహాలనందిస్తున్న రాధ గారికి, మిత్రులకు, చందాదారులకు నెనర్లు. పత్రికకు తమ రచనలను పంపుతున్న చిన్నారులకు, పెద్దలకు, ఓపెన్‌సోర్సు ఉపకరణాలను అందించటం ద్వారా ప్రపంచానికి ఎనలేని సేవచేస్తున్న కంప్యూటరు నిపుణులకు- అందరికీ పలు కృతజ్ఞతలు.


పిల్లల్లో సృజనాత్మకత సహజం. కథలు, ఆటలు, పాటలు, బొమ్మలు దానికి ఊతాన్నిస్తాయి. మాతృభాషలో ఇష్టంగా చదవటం, తేలికగా రాయటం వస్తే అటుపైన అన్ని శాస్త్రాలూ సులభంగా వంటపట్టుతాయి-నిజం! అందుకని మీ పిల్లల్లో ఉన్న కాల్పనిక శక్తికి పదును పెట్టండి. వాళ్లను కథలు రాసేందుకు, పాటలు పాడేందుకు, బొమ్మలు వేసేందుకు ప్రోత్సహించండి. వాళ్ళ రచనల్ని మాకు పంపండి. కావాలనిపిస్తే మీరే ఇలాంటి పత్రికనొకదాన్ని మొదలు పెట్టండి- ఎలాగైనా సరే- పిల్లలు పెద్దవాళ్లయ్యేలోగా వాళ్ళు చాలా చాలా తెలుగు కథల్ని చదివేలా, రాసేలా చేయండి. మీ పిల్లలకు ఈ పత్రికలోని కథలు నచ్చుతాయనే మా నమ్మకం- వీటిని వీలైనంత మందితో పంచుకోండి. మీరు రాసిన పిల్లల కథలు ఏమైనా ఉంటే పనిగట్టుకునైనా సరే, మాకు పంపండి. వీలు చేసుకొని ప్రచురిస్తాం.

## రాజరాజు బిడ్డ

తెలుగుబాల పద్యాల్లో ఓ తిట్టు పద్యం ఉంది:

బడికి నడవలేడు; పాఠాలు వినలేడు;

చిన్న పద్యమప్పజెప్పలేడు-

రాజరాజు బిడ్డరా, నేటి విద్యార్థి

లలిత సుగుణజాల తెలుగుబాల!

మనందరం ఇంకా అంత పాడైపోలేదులేగానీ; నిజంగానే ఆ బాటలో వేగంగా ప్రయాణిస్తున్నామేమో అనిపిస్తుంది చూడగా. బడికి చేర్చేందుకు బస్సులూ, ఆటోలూ వచ్చేశాక, దూరాలన్నీ దగ్గరయి-పోయినట్లున్నాయి, దాంతో మన పిల్లల్లో నడిచే అలవాటు బాగా తగ్గిపోయింది. వ్యాయామపు వేళల్లో తప్ప మరెప్పుడూ శరీరానికి పని లేకుండా అవుతోంది - ముఖ్యంగా నగరపు పిల్లల్లో. ఒకనాడు సైకిళ్లను విస్తారంగా వాడిన పిల్లలు, ఈ రోజున మోటారు వాహనాలమీద అంతగా ఆధారపడాల్సి వస్తోంది. అట్లా బడికి నడవని పిల్లలు, నడవలేని పిల్లలు ఎక్కువౌతున్నారు మరి!

ఇక, 'పాఠాలు వినటం'లోంచి "పాఠాలు చూడటం"లోకి కూడా మనం గబగబా దూసుకెళ్తున్నాం. సాంకేతికతను ఉపయోగించుకోవటంలో భాగంగా వస్తున్న యీ (e)సంస్కృతి - పిల్లల్ని 'వినటం' నుండి 'మల్టీమీడియా'ని అనుభవించటంలోకి మోపుగానే మోసుకెళ్తోంది. రానురాను, పాఠాలు వినాల్సిన అవసరం తగ్గేకొద్దీ, 'పాఠాలు వినే శక్తి' సన్నగిల్లుతుందేమో, పిల్లల్లో.

ఇక పద్యాలు అప్పచెప్పటం కూడా తగ్గిపోతోంది. 'అప్పచెప్పటం' అనే 'కళ' పట్ల కొందరికి అనురాగమూ, మరికొందరికి ఏహ్యభావమూ అయితే చాలానే ఉంటుంది గానీ, పద్యాలపట్ల మటుకు ద్వేషం- ఎందుకో, అందరిలోనూ బాగా ఎక్కువైంది. వెరసి,'చిన్నపద్యం అప్పజెప్పలేక పోవటం' సాధారణమవుతోంది.

అట్లా మనమంతా త్వరలో 'రాజరాజుబిడ్డలం' అయిపోయే ప్రమాదం తలెత్తుతోంది. దీన్నించి తప్పించుకోవాలంటే వేరే మార్గంలేదు - వీలైనంత త్వరగా పుస్తకమహారాజుకు తిరిగి పట్టం కట్టెయ్యాల్సిందే!

అందరం బాగా చదవాలి. జ్ఞానం సంపాదించుకోవాలి. అన్నింటినీ తెలుసుకుంటూ, అర్థం చేసుకుంటూ, నేర్చుకుంటూ పోవాలి. రాజ రాజు బిడ్డలం కాకూడదు మరి!

Published by NarayanaSarma for Kottapalli Prachuranalu,1-127/A, Near M.R.O.Office, Chennekothapalli-515101, Ananthapur District, AP.
Ph: 7702877670 mail: team@kottapalli.in and printed at Mudrica Offset Printers, Vijayawada,Phone:08662579129